జనప్రియ పుస్తకమాల



4

అరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి

# దిక్చక్రం



నవజ్యోతి పబ్లికేషన్స్
ఏలూరురోడ్ • విజయవాడ-2



DIKCHAKRAM
By
Smt. Arekapudi (Koduri) Kousalya Devi

*First Edition* :
August '75

*Printers* :
"SOBHANACHALA"
Vijayawada-1

*Cover Design* :
BAPU

*Publishers* :
NAVAJYOTHI PUBLICATIONS
Eluru Road
Vijayawada-2

*Price* :
Rs. 6-00

కాంచనప్రియుడు

శ్రీ కళ్యాణ చక్రవర్తి

చరణారవిందాలకు.

మా అభిమాన రచయిత్రి

# ఆరెకపూడి (కోడూరి) కౌసల్యా దేవి

ర చ న లు :

| | |
|---|---|
| కల్యాణమందిర్ | సుప్రభాతం |
| ధర్మచక్రం | శోభకృతు |
| ప్రేమనగర్ | కల్పవృక్షం |
| శంఖుతీర్థం | దిక్చక్రం |
| చక్రనేమి | బృందావనం |
| చక్రవాకం | నందనవనం |
| భాగ్యచక్రం | పెళ్ళి ఎవరికి? |
| సంసారచక్రం | తీయనిశాపం |
| బదనిక | అనిర్వచనీయం |
| శాంతినికేతన్ | చక్రభ్రమణం |

# దిక్చక్రం

క్రోమలమైన కాంచన చేతివ్రేళ్ళను సవరిస్తూ ఏదో తలపోస్తున్నాడు మాధవ్.

"ఏమిటా పరధ్యానం?" కాంచన అడిగింది.

ఉస్సురంటూ నిట్టూర్చాడు మాధవ్. "మనపెళ్ళి అవ్వదేమోననే భయంగావుంది కాంచనా?"

"ఎందుకని?" చర్రున తలెత్తుతూ కోపంగా అన్నది. "ఇంత నిరాశ పనికిరాదు బావా. ఉద్యోగం ఈరోజు కాకుంటే రేపుదొరుకుతుంది దానికే యింత డీలాపడిపోవడమా? ఛ"

"కాదు నేను నిరాశపడటంకాదు..." ఏదో చెప్పబోయి చెప్పలేక ఆగిపోయాడు మాధవ్.

"నాకు తెలుసు. మానాన్నావాళ్ళూ ఏదో అంటున్నారని కదూ నీ బాధ? వాళ్ళేమీ చెయ్యలేరు. నా

ముష్టెత్తకుండా. ఆ మాత్రం ధైర్యంవుంది నాకు. నిన్నేతప్ప నేను చేసుకోనని ఏనాడో చెప్పేశాను. గట్టిప్రయత్నం చెయ్యిబావా. ఏదో ఉద్యోగం దొరకకపోదు."

"నీకు తెలియదు కాంచనా, యింట్లో కూర్చునే దానవు. నా బావ ఫస్ట్‌క్లాసులో పాసయ్యాడు గనుక తప్పకుండా గొప్ప ఉద్యోగం వస్తుందనుకుంటున్నావ్. ఎందరో ఉద్యోగాలలోవున్న ఇంజనీర్లనే తీసేస్తున్నారు. దేశం పరిస్థితి ఏమీ బాగుండలేదు."

అంతలో వెనుకనుండి "కాంచనా ?" అనే గర్జన వినరావడంతో ఇద్దరూ వెనక్కి తిరిగి చూశారు.

"ఏంచేస్తున్నా విక్కడ ?" నిప్పులు కురిపిస్తూ ప్రశ్నిస్తున్నాడు కేశవ్. "ఇలాంటి గాలితిరుగుళ్ళు మానమని చెప్పలేదూ ?"

నిర్లక్ష్యంగా చూచింది కాంచన. "నువ్వెందుకొచ్చావ్ ? నేనూ అందుకే వచ్చాను. మన పొలాలలోకి మనం షికారుగా రావటం తప్పా ? దానికి నీకు సంజాయిషీ చెప్పుకోవాలా ?"

"చాల్లే నోర్మూయ్, పద యింటికి" అని చెల్లెల్ని కోప్పడుతూ మాధవ్ దెస చూస్తూ అన్నాడు కేశవ్, "చిన్నపిల్ల-దానికి తెలియకపోతే నీకు లేదూ ఆమాత్రం జ్ఞానం ?"

"కేశవ్ !" ఉగ్రుడైన మాధవ్ అంతకంటె మాట్లాడలేకపోయాడు.

కేశవ్ వెంటవున్న గోపాల్ నేత్రాలలో హేళన కురిపించుతూ అన్నాడు. "పెళ్ళికానివాళ్ళింత స్వేచ్ఛగా తిరగటానికిదేమీ లండనుకాదు."

హేళనగా చూశాడు మాధవ్. "పోస్టుకార్డుకూడా లండన్‌లూ అమెరికాలూ వెళ్తుంది. ఎవడి కాళ్ళో పట్టుకుని ఏ ఏడాది అక్కడున్నంత మాత్రాన, పెద్దకబుర్లు చెప్పకు." హుంకరిస్తూ వెళ్ళిపోయాడు.

పోతూన్న మాధవ్‌ను చూస్తూ పళ్ళు పట పటా కొరికాడు గోపాల్.

## 2

సాయంత్రంవరకూ అక్కడక్కడా అన్యమనస్కంగా తిరిగి తిరిగి యిల్లుజేరుకున్న మాధవ్ తన గదిలోనికి వెళ్ళబోతూ తండ్రిమాటలు విని ఆగాడు.

"ఎందుకూ, చేసే నిర్వాకమేమీ లేకపోగా ఊరట్టుకు తిరిగి లేనిపోని గొడవలు తేవడం కూడా దేనికి? కాస్త ఆ పొలంవెళ్ళి ఆ పనులైనా చూడరాదూ?"

నిర్ఘాంతపోయాడు మాధవ్, "నేను ఊరట్టుకు తిరిగి తేనిపోని గొడవలు తెస్తున్నానా?"

పొగాకు చుట్టుకుంటూన్న అనంతయ్య కోపంగా అన్నాడు మాధవ్ నే తీక్షణంగా చూస్తూ.

"ఆ, కాదామరి! పైగా ఏమీ ఎరుగని అమాయకుడిలా తలెత్తి అడుగుతున్నావా?"

"ఏమిటినాన్నా? ఏమిటో తిన్నగా చెప్పరాదూ?" విసుగ్గా అడిగాడు మాధవ్.

"ఏమిటా?" వంటింట్లోనుంచి తల్లి పార్వతి వచ్చింది విసురుగా. "నువ్వూ కాంచనా కలిసి షికార్లు తిరుగుతున్నారటగా? అదేమైనా నీకట్టుకున్న పెళ్ళామా? ఎందుకిలాంటి పనులు చేస్తున్నావ్? ఇంతవరకూ నీ మేనమామ వచ్చి నానామాటలూ అనిపోయాడు. ఇక ఇదిగో ఈయన యజ్ఞం మొదలుపెట్టారు. గంటనుంచి ఒకటేతిట్లు నిన్నూ నన్నూ." భర్తవైపుచూస్తూ అని వచ్చినంత విసురుగానూ తిరిగి పోయింది వంటింట్లోకి కన్నీళ్ళు తుడుచుకుంటూ.

మాధవ్ సమాధానం చెప్పేలోగా అనంతయ్య అందుకున్నాడు. "వేలకువేలూ పెట్టి చదివించి ఎన్నో ఆశలు పెట్టుకుంటే నా రాత ఇలాగైంది. అందరికొడుకులూ ఇలాచదివి అలా చక్కటి ఉద్యోగాలూ, కట్నాలు తెచ్చుకుంటుంటే నా కొడుకు ఇంజనీరింగ్ డిగ్రీ నాలుక గీసుకో

డానికక్కూడా పనికిరావటంలేదు. పైగా లేనిపోని తగవు లొకటా?"

"నాన్నా!" అసహనంగా అరిచాడు మాధవ్.

"ఆఁ. ఔను. ఎందుకు ఎదురు అరుస్తావ్? ఈ మాత్రం ప్రయోజకత్వానికి యింట్లో పడుండక - ఆ గోపాల్ని ఏదో అన్నావట. ఎందుకొచ్చిన గొడవలురా ఇవన్నీ? ఛీ."

అయిదు నిముషాలపాటు అలా కన్నార్పకుండా చూచిన మాధవ్ మౌనంగా తన గదిలోనికిపోయి ఓ ఇరవై నిమిషాల అనంతరం చేతిలో పెట్టెతో బయటికి వచ్చాడు. తిన్నగా వంటింట్లోవున్న తల్లివద్దకువెళ్ళి నిలబడ్డాడు; ఆమె తలఎత్తి చూడనైనా చూడలేదు.

తల్లి చూడకపోయినా తానే మాట్లాడాడు మాధవ్. "కాంచన కట్టుకున్న పెళ్ళామా అని అడిగావ్‌కదూ అమ్మా నువ్వు? మాకు జ్ఞానం వచ్చినప్పట్నుంచీ మీరంతా మీ మాటలతో మమ్మల్నిద్దర్నీ భార్యాభర్తలుగానే కట్టేశారుగా? ఈనాడు - ఈ తేడాలు...సరేలే, అదంతా ఎందుకుగానీ - వెళ్తున్నాను. ఇక మీ కెవ్వరికీ నావల్ల బాధ వుండదు."

గబగబా అనేసి చకచకా వెళ్ళిపోతూన్న కొడుకు

దెస నిర్ఘాంతపడి చూచి, ఆతంగో తేసుకుని "ఎక్కడికిరా బాబూ, నే నేమన్నాననీ ?" అని వెంటపడింది పార్వతి.

అప్పటికే మాధవ్ తండ్రివద్ద నిలబడి, "చాలా పెట్టుబడిపెట్టి చదివించారు. కాని మీరనుకున్నట్లు అసమర్థుణ్ణి కాను. మీ ఆశలు తీర్చకపోగా మీకు ఇలా నిత్యం బాధ కలిగించుతూ గుండెలమీద కూర్చోలేను. ప్రయోజకుణ్ణి కాగలిగిననాడు - మీ క్షిప్తమైతే వస్తాను. క్షమించండి." అనేసి వేగంగా ముందుకు సాగాడు.

"ఎక్కడికి ?" లోపల ఎలావున్నా పైకి గంభీరంగానే ప్రశ్నించాడు అనంతయ్య. వెనుకకు చూడకుండానే సాగిపోతూనే సమాధానమిచ్చాడు మాధవరావు. "ఏమో ప్రస్తుతం ఏట్లోకి మాత్రం కాదు !"

"పోనీయవే, వాడెక్కడికి పోతాడు ? రెండ్రోజుల్లో తిరిగిరాడూ కడుపులో నకనక లాడగానే? ప్రయోజకత్వాలు లేకపోయినా, పౌరుషాలకేమీ కొదువలేదు." కొడుకుపై ఈసడింపు వ్యక్తపరుస్తూ భార్యను ఓదార్చాడు అనంతయ్య. "ఇంజనీరుని చేద్దామని ఉన్న పొలమంతా అమ్మి వాడి మొఖాన కొట్టాను. ఇవ్వాళ ఒక్కమాట అనటానికి నాకు స్వతంత్రం లేదన్నమాట. కానీయ్. సాటివాళ్ళు ఉద్యోగాలుచేస్తూ, లక్షల కట్నాలతో పెళ్ళిళ్ళు చేసుకొంటుంటే ఈ వాజమ్మ బ్రతుకిలాగైంది. నా ప్రారబ్ధం ఇలాగుంది" అంటూ గొణుక్కొన్నాడతను.

# 3

"చెప్పకుండా చెయ్యకుండా మాయమైపోయిన వాణ్ణి గురించి ఇంతటి బెంగెందుకే? కన్నవాళ్ళే మరచి పోయారు వాణ్ణి"

"అమ్మా!" కోపంగా అదలించింది కాంచన.

"ఔను," కేశవ్ కలుగజేసుకున్నాడు. "నాలుగు నెలలైంది వెళ్ళి. ఓ ఉత్తరముక్కైనా రాశాడా? వాడి కోసం బెంగపెట్టుకొనే వాళ్ళున్నారన్న జ్ఞానమేవుంటే ఇలా ఎందుకేడిపించుతాడు? చూడు వాళ్ళే ఇక వాడిని వదులుకుని తర్వాత వాడికి పెళ్ళి చేసేశారు."

"అబ్బబ్బబ్బ." వినలేనట్లుగా రెండు చెవులూ మూసుకుంది కాంచన. "ఎందుకు నన్నిలా చిత్రవధ చేస్తారు? చిన్నప్పట్నుంచీ మీరు పెంచిన ఆశలే యివి. ఇవాళ మీరు కాదన్నారని మా మనసులు మారవు. నేను బావనుతప్ప పెళ్ళిచేసుకోను."

కోపం ప్రదర్శించి లాభంలేదని గ్రహించాడు కేశవ్. లేని ఓర్పు కొనితెచ్చుకుని శాంతంగా మాట్లాడ ప్రారం

భించాడు. నీ మాటలే నిజం కాంచనా. కాని, ఏడీ-వున్నాడో లేడో తెలియని మనిషికోసం ఎన్నాళ్లిలా జపంచేయటం చెప్పు? ప్రేమించిన నువ్వెంత ఏడుస్తావో, తన కన్నవారెంత ఏడుస్తారో అనే చింతలేని నిర్దయుడు, జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కో-లేని పిరికివాడు, ఇటువంటివాడితో నువ్వు బ్రతుకేం వెళ్ళదీయగలవు? చూడు. గోపాల్ దాటిపోయాడంటే మళ్ళీ అటువంటివాడు దొరకడు. ఫారిన్ రిటర్న్డ్ డాక్టర్. మంచి వంశం. లక్షలకు లక్షలు ఇస్తామని రోజూ ఎందరెందరు ఆడ పిల్లల తండ్రులు వస్తున్నా కాదని నీకోసం వేచివున్నాడంటే ఇది మన అదృష్టం కాదూ?"

"అన్నయ్యా. నీ గోపాల్‌కొక దణ్ణం. అతడు చాలా గొప్పవాడే. నేను మాత్రం కాదన్నానా? కాని నా కక్క-ల్లేదు ఆ గొప్పలన్నీ. ఎన్నేళ్ళైనా నేను బావకోసం ఎదురు చూడగలను."

"నీ యిష్టం మరి. చెప్పవలసిందంతా చెప్పాను. ఎవరినో ఆరాధిస్తూ ఇంట్లో వాళ్ళందర్నీ ఏడిపించటం సబబా?"

కామాక్షి అందుకుంది. "ఈ రోజుల్లో ఎందరు ఇంజనీర్లూ డాక్టర్లూ ఉద్యోగాలు లేకుండా వున్నారు? మహా తన కొక్క-డికే ఈ కష్టంవచ్చినట్టు అలా ఇల్లువదలి అయిపూ అజాలేకుండా పోతాడా?"

రోజులకొలదీ, నెలలకొలదీ ఇలాంటి మాటలు వినగా వినగా, మాధవ్ చేసిన పనిమాత్రం హర్షదాయకం కాద

న్పించింది కాంచనకు. "ఎంతైనా విరక్తికలగనీ - అందరూ సూటి పోటీ మాటలే వాగనీ. కాని ఇంత ప్రాణప్రదంగా ప్రేమించిన నాకు ఒక్కమాటైనా చెప్పకుండా ఇలా అంతర్ధానమైపోతే నేనేంగావాలి? అసలెందుకింత అర్ధాంతరంగా వెళ్ళిపోయాడు? ఆ రోజు మధ్యాహ్నం అన్నయ్యా, గోపాలూ అన్నమాటలకు కోపం వచ్చిందేమో? వాళ్ళ గురించి నాపైకూడాకోపం వచ్చిందా? నేనేం చేయను?"

"అసలేం జరిగిందో ఏమిటో...అత్తయ్య నడగాలి. అత్త నిజం చెప్పకపోదు." అనుకుంటూ ఒక సాయంత్ర సమయాన "స్నేహితురాలింటికి" అని అబద్ధం చెప్పి బయలుదేరింది కాంచన.

వీధి ద్వారంలో కాంచనను చూస్తూనే ముఖం ముడుచుకుంది పార్వతి. కనీసం మర్యాదగానైనా రమ్మనీ, కూర్చోమనీ అనలేదు. మాధవ్ ఇల్లూ ఊరూ వదలిపెట్టిన నాటినుంచి ఈనాటివరకూ ఈ యింటిమీద కాకి ఆ యింటిమీద వాలలేదు. ఎవరి కోపాలు వారికున్నాయి.

కాంచన తండ్రి నారాయణమూర్తి పార్వతికి స్వంత అన్న. మాధవునికంటే నాలుగేళ్ళు చిన్నదైన కాంచన పుట్టి నప్పుడే కాంచనామాధవులను భార్యాభర్తలుగా నిర్ణయంచేసి,

నాలుగేళ్ళ క్రింత వరకూ అలాగే సంభోదిస్తూ తమ ఇచ్ఛానుసారం పరిహాసోక్తులు కూడా విసరటం మామూలైపోయింది అందరకూ. అందుకే కాంచనా మాధవులిద్దరికీకూడ అదేభావమే కాని మరో యోచనే లేకపోయింది. ఆ భావానుగుణంగా ఎన్నోస్వప్నాలు ఊహించుకున్నారు. ఉహాపంర్మాల్యలను నిర్మించుకున్నారు.

అయితే, నాలుగేళ్ళనాడు నారాయణమూర్తిక హఠాత్తుగా పుగాకు, పసుపు పంటలలో బాగా కలిసవచ్చి లక్షల లాభాలెత్తి, మధ్యతరగతినుండి ధనికస్థాయిలోకి జేరడంతో, మేనల్లుడిపై చిన్నచూపూ, కూతురికిలక్షలకట్నాం గుమ్మరించి బాగా ధనికసంబంధం తెచ్చుకోగల సన్న ధీమా ఏర్పడడంతో రెండు కుటుంబాలమధ్యా ఆప్యాయతలు కొంత సన్నగిల్లాయి. ఆ తర్వాత ఏడాది మాధవరావు ఇటు ఇంజనీరింగ్ డిగ్రీ తీసుకుంటూనే అటు నిరుద్యోగుల జాబితాలో జేరడంతో నారాయణమూర్తి పూర్తిగా మాధవరావును తన దృక్పథంలోనుండి తొలగించి వేశాడు. అక్కడా అక్కడా తన అభిప్రాయాన్ని వెలిబుచ్చడం, వేరే సంబంధాల గురించి వాకబు చేయడం కర్ణాకర్ణిగా పార్వతీ అసంతయ్యల చెవులను సోకడంతో పరిస్థితి పట్టుదలలవరకూ పెరిగింది. ఆ ఊరికి క్రొత్తగా డాక్టరుగా వచ్చిన గోపాల్‌పై నారాయణమూర్తి కన్ను పడిందనికూడా పార్వతి విన్నది.

"ఇదేమిటన్నయ్యా ? నువ్విలాగ ఎందుకు ప్రవర్తిస్తున్నావో అర్థంకావటంలేదు. ఏళ్ళతరబడిగా అనుకుంటూన్న మాట ఇవాళ ఎలా కొట్టివేయగలం ?" అని అడిగింది ఒక నాడు పార్వతి పనిగట్టుకు వెళ్ళి.

నారాయణమూర్తి తడుముకోకుండా సమాధానం చెప్పాడు ! "అనుకోటానికేంలే, నోటిమాటేగాని నిశ్చితార్థం ఏమీ చేసుకోలేదుగా ? నువ్వే చెప్పు - నీ కూతురే అయితే నిరుద్యోగికి చేస్తావా ! వాళ్లెలా బ్రతుకుతారు ? పోనీ ఆస్తి అంటే అంతంతమాత్రం. ఇంకా వెనుక తమ్ముళ్లూ చెల్లెళ్లూ...ఇందరి బాధ్యతలుకూడా వున్నాయిమీద."

పార్వతికి కోపం వచ్చింది "మంచిది. ఈ ఆలోచన లన్నీ నాలుగేళ్ళ క్రితంవరకూ లేవన్నమాట. ధనం కళ్ళు కన్పించనీయదంటారు, ఇదే. కన్నతీపి, రక్తసంబంధం దేనికీ గుర్తింపులేదు డబ్బుముందు. మాట నిలకడకూడా లేదు. కానీ గుర్తుంచుకో. నేను నిన్నేం ప్రాధేయపడను. మాధవుడు మగవాడు. పెళ్ళికాకపోదు, డబ్బుతోనే అన్నీ సుఖాలూ రావు."

హేళనగా నవ్వాడు నారాయణమూర్తి. "డబ్బులేని ప్రతివాళ్ళూ అలాగే సరిపెట్టుకుంటారు."

ఆ తర్వాత కాంచనను మాధవ్‌ను కల్సుకోవద్దని ఆంక్ష విధించడంతో పట్టుదలలు పరాకాష్ఠ నందుకున్నాయి.

ఆ తర్వాత మరలా ఇన్నాళ్ళకు కాంచన వచ్చింది మేనత్తయింటికి. పార్వతి పలుకరించకపోయినా తానే చెంతకువచ్చి కూర్చుంది కాంచన.

చాల తడవు మౌనమే రాజ్యం చేసింది.

"నామీదెందుకత్తయ్యా అంత కోపం! నేనేం చేశాను?" డగ్గుత్తికతో అడిగింది కాంచన.

విసురుగా తలెత్తింది పార్వతి. "మీ అందరిపై కోప గించటానికి నేనెవరినే, బీదదాన్ని. నా కొడుకే నాచేత ఓ మాట అన్పించుకోనని వెళ్ళిపోయాడు. ఇక మీ అందరికీ నేనెవర్ని?"

ధరణి కభిముఖంగా వున్నాయి కాంచన చూపులు. అలాగే తలెత్తకుండా మెల్లని స్వరాన అన్నది: "అసలేం జరిగిందో - బావ ఎందుకు వెళ్ళిపోయాడో — ఎక్కడికి వెళ్ళి పోయాడో నీకైనా తెలుస్తుంది-చెప్తావని వచ్చానత్తయ్యా. ఎవరిపైనోగల కోపం నాపై కురిపించకు."

"ఎక్కడికి వెళ్ళాడో నాకు తెలియదు." అశ్రువులు జలజలా రాలిపోతూండగా దీనత్వంతో పలుకుతూన్న

పార్వతి కంఠం ఒక్కసారిగా మళ్ళీ రోషంతో స్థాయిని పుంజు కున్నది. "ఎందుకుపోయాడో మాత్రం నాకు తెల్సు."

ఆ కారణం వినాలని ఆతృతతో చటుక్కున తలెత్తి పార్వతి దెస చూచింది కాంచన.

"నువ్వే. నీ కారణంగానే వాడు పరాయైపోయాడు. అర్థాంతరంగా మాకే నడమంత్రపు సిరీ వచ్చి చుట్టుకో లేదు. అందుకే మా మనసుల్లో ఏవిషమూ లేదు. పూర్వంలాగే మేమున్నాం. మీనాన్న మారిపోయాడు. మారి పోయినవాడు మారినట్లుండక, ఇంటికివచ్చి నానామాటలూ అనిపోయాడు. ఆ కోపమంతా మేము వాడిపై చూపెడితే వాడు ఇల్లు వదిలిపోయాడు." దుఃఖం పెల్లుబికిరాగా మాటలు ఆపుచేసింది.

పిడుగుపాటుకు స్తంభించిపోయినట్టుంది కాంచన పరిస్థితి.

తిరిగి అన్నది పార్వతి. "ఆనాడు — లేచి ఎవరిమొఖం చూశాడో — నువ్వూ వాడూ ఎక్కడో తోటలో తిరుగుతూంటే మీ అన్న కేశవుడూ ఆ గోపాల్‌గాడూ చూచి ఏదో ఘర్షణపడ్డారటగా! ఆనాడే వచ్చి మీ నాన్న నానా రభసా చేశాడు. ఆనాడే మాధవ్ మాకు దూరమయ్యాడు. అంతా తెలుసుండీ పైగా ఏమీ ఎరగనట్లడుగుతున్నావా?"

"అత్తయ్యా, ఇందులో నా తప్పేముంది?" దీనంగా విస్మయంగా అడిగింది కాంచన.

"నీదే. తప్పంతా నీదే." రెచ్చిపోతూ తారస్థాయిలో అన్నది పార్వతి. "నువ్వు కాక ఇంకెవరు? తల్లి దండ్రులు వద్దన్న తర్వాత ఆడది దానిహద్దుల్లో అది పడుండాలి. తగుదునమ్మా అంటూ షికార్లు కొడతావా వాడితో? ఆ మాత్రం తెగువవున్న దానివి "నా బావ నా మొగుడు" అని గట్టిగాచెప్పి వాడి తరఫున దెబ్బలాడ లేకపోయవా. నీ ఎదుటే ఘర్షణపడ్తూంటే? ఆడదాన్ని అదుపులో పెట్టుకోలేక, సిగ్గులేని నీబాబు నన్నూ నా కొడుకునూ తిడతాడా?"

కనులు ధారాపాతంగా వర్షిస్తూంటే ఏమీ మాట్లాడలేక కూర్చునిపోయింది కాంచన.

"ఇప్పుడెవళ్ళేడిస్తే ఏంలాభం? నా కొడుకు ఎక్కడున్నాడో ఏమయ్యాడో - ఎవళ్ళ ఏడుపులూ ఊడుపులూ వెదకి తీసుకురాగలవు? అయినా ఇదంతా నా ప్రారబ్ధం. అందరు తల్లులూ కొడుకులకు పెళ్ళిచేసి కోడళ్ళను తెచ్చుకుంటూంటే నా అదృష్టం ఇలా అడుక్కు తిన్నది. అయినా మగవాడి అదృష్టం కట్టుకున్న దాన్నిబట్టి కళకళలాడటమో, వెళవెళలాడటమో అంటారు. మరి నీ యోగం అంత దివ్యంగా

వున్నట్లుంది— వాడికిని అజ్ఞాతవాసం చాలుజేసింది, ఇంకా మూడుముళ్ళూ పడకముందే."

తన కుమారుని నిరుద్యోగి, బీదవాడూ అంటూ హేళనచేసిన వానికి కూతురెను తానూ ఏదో అన్నాను. బకులు చెల్లించుకున్నాను అనుకున్న దేకాని పార్వతి, అమాయకు రాలూ, సున్నిత హృదయిసి అయిన కాంచన మనసుపై అవి ఎలా పనిజేస్తాయో ఆమె రవ్వంతైనా ఆలోచించలేదు.

# 4

ఇంత సులభంగా కాంచన గోపాల్‌తో పెళ్ళికి అంగీక రిస్తుందని ఎవరూ భావించలేదు.

"గోపాల్ కాదు — ఏ గోవుకో, గోడకో నన్ను కట్టబె ట్టినా సరే అభ్యంతరమేమీ లేదు. సరేనా?" అన్నది విసుగుతో. "నాపెళ్ళి చేసెయ్యాలి మీకు నచ్చినవాడు దొరికాడు, ఇదేగా మీ తొందర? కానీయండి" అనేసింది. అదే మహాప్రసాదంగా భావించి, ఇక ఆమెను మాట్లాడించ కుండా, ఏ విధమైన తర్క-వితర్కాలకూ అవకాశ మియ్య కుండా చకచకా పెళ్ళి పనులు సాగించారు, అన్నింటిలో కెల్లా దగ్గర ముహూర్తం నిర్ణయించి.

విషయంవిన్న పార్వతి వలవలా ఏడ్చింది. "నాయింటి

కోడలు కావలసినది, నా కోడలుగా నా యింట అడుగు పెట్టవలసినది..." అంటూ క్రుళ్ళి క్రుళ్ళి ఏడ్చింది.

"పోనీయ్. వ్రాసిపెట్టిలేదు. అంతే. ఎందుకు విచారి స్తావ్ ?" అంటూ అనంతయ్య భార్యను ఓదార్చాడే కాని అతడి దిగులు అవధులను మించిపోయి మంచంపట్టాడు.

"అసలు మాధవ్ బ్రతికివున్నాడా? బ్రతికే వున్న ప్పటికీ కాంచనకు పెళ్ళైపోయిందని వింటే వచ్చాక, బ్రతుకు తాడా ?"

కాంచన మనసు మహాసాగరంవలె వున్నది "జన్మ జన్మలకూ నువ్వే నా భర్తవు. నువ్వే నా భార్యవు" అని ఎన్ని సార్లు తామిద్దరూ ప్రమాణాలు చేసుకున్నారో, ఎన్నెన్ని కబుర్లూ, వాగ్దానాలూ, కలలూ ! అన్నీ ఇలా ఆయువులేనివై పోయాయా ? బావతిరిగివస్తే అతడిముఖాన్ని ఎలాచూచేది?" "కాంచనా ఇంతేనా నీ ప్రేమ ?" అని అతడడిగితే ఏంసమా ధానం చెప్పేది ? తన నతడెంత అల్పంగా అంచనా వేసు కుంటాడు ! ఎంత నిలకడ లేనిదానినిగా భావిస్తాడు ! కాని ...కానీ...బావయేకాదు, ఎవ్వరైనా ఎలాగైనా అనుకోనీ, ఫర్వాలేదు. ఎన్ని అవహేళనలైనా ఎదురుకానీ, సహిస్తాను. అత్తయ్య అన్నట్లుగా అతని జీవితంనుండి నా నిష్క్రి మణతోపాటు కష్టాలుకూడా నిష్క్రమించి అతడి జీవితం ఆనందమయం కావటంకన్న నాకు కావలసిన దేమిటి ?"

# 5

"పాపం, పెండ్లికూతురెందుకో చాలా విచారంగా వున్నదని మా స్నేహితులంతా." అనుకుంటున్నారు వచ్చి మంచంమీద కూర్చుంటూ అన్నాడు గోపాల్ కాంచన వేపు చూడకుండానే. కాని క్రీగంట గమనించుతూనే వున్నాడు, కాంచనలో ఈ మాటలు ఎలాంటి సంచలనాన్ని కలుగజేస్తాయోనని.

కదులూ మెదులూ లేక అలాగే ప్రతిమవలె నిలబడి వున్నది కాంచన ధరణికభిముఖమైన చూపులతో.

"అమ్మాయిగారు మరోలోకంలో వున్నట్లున్నారు. ఈ అభాగ్యుడు సన్నిధికి వచ్చాడని గమనించారా" ఈసారి తలెత్తి ఆమెవైపు చూస్తూ అన్నాడు. వీలైనంత హేళనను స్వరంలో గుమ్మరిస్తూ.

అప్పటికీ కాంచనలో చలనం కన్పట్టలేదు.

కొన్ని నిమిషాలు మౌనంగా పచార్లు చేశాడు అటూ యిటూ.

"దాహంగావుంది. కొంచెం మంచినీళ్ళియ్యి కాంచనా" అన్నాడు తిరిగివచ్చి మంచంపైవాలుతూ.

తెచ్చి మౌనంగా అందించింది కాంచన.

త్రాగుతూ ఆమెదెస చూచాడు. ఆ వదనంలో నిర్లిప్తతా సర్వీకారాలు మినహా ఏమీలేవు.

"కూర్చో" అన్నాడు అధికారంగా.

ఆమె అలా నిలబడే ఉంది.

"చూడూ, నీ మనస్సు ఎక్కడున్నప్పటికీ, నీకు నాపై ఎంత అయిష్టం అయినప్పటికీ ఇక నేను నీకు భర్తను" అన్నాడు భర్తఅనే పదాన్ని ఒత్తిపలుకుతూ "ఇక నువ్వు నాతో కాపురం చేయాల్సిందే, ముందు ఆ ఏడుపు ముఖాన్ని శాస్త నవ్వులోకి దింపు."

చివుక్కున తలెత్తింది కాంచన. "మొదటి రోజు......భర్తనుండి భార్య ఆశించేదీ వినవలసిందీ ఇది కాదు"

"ఓ !" గ్లాసు బల్లమీద వుంచుతూ అడిగాడు గోపాల్ వికటంగా. "మరొకటి ఉంటుం దన్నమాట అయితే! ఏమిటో అది? కాస్త చెప్పు వింటాను. మాధవ్ చాలా నేర్పివుండాలే నీకు? లాలనా, ప్రతిమాలటం-ఇవన్నీ ఎందుకూ ? నీకిదేం కొత్త కాదుగా ?"

"గోపాల్?" దెబ్బతిన్నట్లు చూచింది కాంచన. "యింత నీచంగా నన్నవమానించటానికే అంత ప్రేమ నంటించి ఈ పెళ్ళి చేసుకున్నారా?" ఆమె కనులు వర్షించేందుకు సిద్ధంగా వున్నాయి. ంత నీచురాలినేనని మీరు భావిస్తే ఎందుకు చేసుకున్నారీ పెళ్ళి ?"

వికృతమైన నవ్వూ, వికటం, విరసం విన్యాస మాడాయి అతడి పెదవులపై. "నువ్వు... నువ్వునన్నెందుకు చేసుకున్నావ్? రెడీమేడ్ మొగుడు అయిపూ అజా లేకుండా మాయమై పోయాడు గనుక. ఇక నేను... నేనెందుకు చేసుకున్నానో నీకే తెల్సు. తెలియకపోతే ముందు ముందు తెలుస్తుంది."

నీరసంగా నిస్తేజంగా నిలబడిపోయింది కాంచన. "ఇటువంటి మాట విని, నింద భరించి నేనెలా బ్రతికి వున్నానింకా ?" అంతరాత్మ రోదించింది.

"ఏమిటివన్నీ? మిఠాయీ, మట్టీ మశానం, ఛీ" టేబుల్‌పై అందంగా అమర్చబడిన తినుబండారాలను చూచి అసహ్యించుకుంటూ అటూ యిటూ కెలికి, ఒకటి రెండు రుచి చూసి నేలకు పెట్టి కొట్టాడు, "మూర్ఖులు, వెధవ పాతపద్ధతులు. పూర్ ఇండియా! ఉత్సాహం. యౌవ్వనం వురకలువేసే జంటకోసం బార్ అమర్చాలని ఏనాడు గుర్తిస్తారీ మూర్ఖులు! "డార్లింగ్! విస్కీ? రమ్? వ్వాట్ డూ యూ లైక్?" అని నవవధువు అడిగేరోజు ఏనాడు వస్తుంది? మనకి మిఠాయిలూ, అరిసెలూ, సున్నివుండలూ- ఛీ. ఉన్న ఉత్సాహంకూడా నశించి పోతుంది వీటిని చూస్తే."

నిర్వ్హెరపోయి చూడసాగింది కాంచన భర్త వదరు బోతుతనాన్ని.

"లైటు తీసేసి పడుకో" ఆర్డరు జారీచేశాడు, ప్యాంట్ జేబులోనుండి సీసాతీసి త్రాగుతూ.

"ఎక్కడున్నావ్ బావా? నీ క్షేమం కోసం నేనీ నరకంలో ప్రవేశిస్తున్నాను. నరక ద్వారంలో అడుగు పెట్టాను. తిరిగి వచ్చాక నన్ను విశ్వాసఘాతకురాలిగా, చంచల హృదయినిగా మాత్రమే నీవు అంచనా వేసుకుంటావ్ కదూ!" అరణ్యరోదన ఆరంభమైంది.

# 6

"అబ్బ ఏమిటీ కల? అబ్బ ఎంత చెడ్డకల?" కళ్ళు నులుముకుంటూ లేచి కూర్చున్నాడు మాధవ్. కాంచన ఏడుస్తూన్నట్లూ, ఆమెనెవరో రాక్షసులు మంటలలో విసిరేసినట్లూ ఏమిటేమిటో అర్థం పర్థం లేకుండా ఎన్నో దృశ్యాలు.

వెంట తెచ్చుకున్న డబ్బు కాస్తా అయిపోయింది. రెండ్రోజులనుండీ తినటానికేమీ లేదు. కడుపునిండా మంచినీళ్ళు త్రాగి నదిఒడ్డున పడుకున్నాడు. అదే ఊరో ఏమిటోకూడా అతడికి తెలియదు.

తెల్లవారుఝాము సమయం. నదిలో స్నానానికి వస్తున్నారు భక్తులు. "ఇదేదో పుణ్య క్షేత్రం కాబోలు. ఇంతమంది ఇంత నియమ నిష్ఠలతో పూజలు జరుపుతున్నారు. అయినా కష్టం లేనిమానవుడే వుండడు ఈ పృథ్విపై. ఇక

ఏమాశించి ఈ వ్రతాలూ, పుణ్యాచరణలూ? నిజంగా దైవం వున్నాడా!" కాలుతూన్న కడుపుతో నీరసించిన దేహంతో ఆలోచిస్తున్నాడా యువకుడు. నిరాశ నిండిన వేళ అంతర్యామి ఉనికినే అనుమానించడం సహజం మానవునికి.

ఉషోదయమైంది.

"ఇది ఏ ఊరు?" ఎవరినో అడిగాడు మాధవ్.

"ఇంత ప్రసిద్ధిగల ఈ పుణ్యక్షేత్రం పేరే ఎరుగవూ? పిచ్చివాడి లాగున్నావ్!" అంటూ వెళ్ళిపోయాడు పాంథుడు.

"జనార్ధనస్వామి గుడి నాయనా. దర్శించుకో పాపాలు పోతాయి" మరొకతడు అన్నాడు.

నిర్జీవంగా నవ్వుకున్నాడు మాధవ్. "పుణ్యాలు చేశానో లేదో తెలియదు కానీ పాపాలు మాత్రం చేయలేదని నిస్సంకోచంగా చెప్పుకోగలను" అనుకొంటూ అలాగే వచ్చే పోయే యాత్రీకులను చూస్తూ కూర్చున్నాడు. "ఏం చేయాలిక? ఎక్కడికి వెళ్ళను? అందర్నీ అడగటమైంది. ఎవర్నడగనిక? ఎవ్వరిస్తారు ఉద్యోగం? ఎలా బ్రతకనిక?" భవిష్యత్తు అంధకారమయంగా గోచరించింది. దరీ తెన్నూ లేని ఆలోచనలతో హృదయం మహారణ్యంవలె వున్నది.

"ఇంతటి హీనమైన, బాధాకరమైన బ్రతుకును- ఇటువంటి పోరాటనకరమైన జీవితాన్ని పగవాళ్ళకు ప్రసాదించమని కూడా కోరకూడదు !

యాత్రీకులచేత స్నానాలు చేయించి యిచ్చిన దక్షిణ తీసుకుంటున్నారు కొందరు. వారి మూటాముల్లే మోస్తున్నారు కొందరు. అరటిపళ్ళూ, కొబ్బరికాయలూ అమ్ముతున్నారు మరికొందరు. పిల్లలనాకర్షించే వస్తువులమ్మి కొందరు పైసాలు సంపాదిస్తూంటే, పానీయాలు అమ్మి యింకొంత మంది రూపాయలే సంపాదిస్తున్నారు.

అంతా చూస్తున్న మాధవ్ మదిలో అనేక ఆలోచనలు చెలరేగాయి. "పనిని మనిషి సృష్టించుకోవటంలో వున్నది కానీ పనుల్లేకపోవటమనేది లేనేలేదు. ఇటువంటి దృశ్యాలు చూచిన ఎవరూ ఈ దేశంలో పనుల్లేవనీ, జనం కూలీలేక, తిండిలేక అల్లల్లాడుతున్నారనీ అనగలరు? ఈనాడు ఈ ఉత్సవంలో పదేళ్ళ పిల్లలూ పనులు చేస్తున్నారు; శత వృద్ధులూ పాటు పడుతున్నారు, ఇలాగే దేశమంతా. చేసుకు తినేవాడికి పని లేకపోవటమంటూ లేదు. కాకపోతే నేను "ఫలానా" పని మాత్రమే చేస్తాను. మరొకటి చేయను అని పట్టుబట్టుకూర్చోవడంలోనే ఈ దేశంలో "నిరుద్యోగం" అనే రాక్షసి బలవత్తరమైన స్థావరమేర్పరచుకొని రాజ్య

మేల్తుంది... నేను ఇంజనీరింగ్ చదివి పాసయ్యానూ అంటే ఎవరూ "అక్కర్లేదు పొమ్మంటున్నారు సరే కూడు పెట్టని ఆదరణ లభింపజేయని ఈ డిగ్రీ దేనికి? అందరూ "ఇంజనీరు" మాకక్కర్లేదూ అంటే పోనీయ్-మరోపనిపదైనా చేయటానికి నేనే ఎందుకు తయారుకాకూడదూ?"

ఈనూతనభావోదయంతో నీరసం నిస్తేజంపటాపంచలై నూతనోత్తేజం కలుగగా ఉల్లాసంగా లేచి నిలబడ్డాడు మాధవరావు.

భానోదయమైంది.

అంతకంతకు జనం రద్దీకూడ ఎక్కువౌతూన్నది. వచ్చే వాహనాలు వస్తున్నాయి; వెళ్ళేవి వెళ్తున్నాయి.

అల్లంతలో చెట్లకింద నది ఒడ్డున వరసగా ఆగివున్న కార్లవైపు నడిచాడు మాధవ్. ఒక్క క్షణం ఆలోచించాడు.

స్థిరనిర్ణయం చేసుకొన్నాడు.

ధరించివున్న చొక్కా విప్పేసి, దానితో వరసగా ఒకోక్కకారే తళతళలాడేట్లు తుడవడం ప్రారంభించాడు.

"పోనీ పాపం, శ్రమపడ్డాడు" అన్నట్లుగా ఆయా వాహనాల యజమానులు వచ్చి వెళ్ళిపోతూ తమకు తోచిన విధంగా పావలా, అర్ధా చేతిలో రాల్చి వెళ్ళిపోయారు. ఒకొక్కక్క వ్యక్తి ఏమీ ఈయకుండా "నిన్నెవడు చెయ్య

మన్నాడోయ్?" అన్నట్టు చూస్తూ నిర్దాక్షిణ్యంగా వెళ్ళి పోయాడు. మాధవ యిచ్చినవారినివద్దనలేదు, ఈయనివారిని యాచించలేదు. ఇది చాలా క్రొత్త అనుభవం అతడికి. సరి క్రొత్త గుణపాఠం కూడా. చేతికి వచ్చిన డబ్బు మొత్తం ఆరు రూపాయల చిల్లర. "ఫర్వాలేదు" అన్పించింది ఆకలి బాధతో వున్న అతడికి. యాత్రీకుల కొరకై అక్కడ అనేక అంగళ్ళూ, దుకాణాలూ, చిన్నసైజు హోటళ్ళూ వెలిసి ఉన్నాయి. రెండ్రూపాయలతో కడుపు నింపుకొని ఆకలి బాధను అణచి; తిరిగివచ్చి తనపని మరలా ప్రారంభించాడు.

మరలా తృణమో ఫణమో చేతిలో పడ్తోంది.

"ఇంద, ఇది తీసుకోలే, వెళ్ళాలి."

ఆ స్వరం విని తలెత్తి చూచాడు.

పది రూపాయల కాగితం నిర్లక్ష్యంగా తన చేతిలో పడవేస్తూన్న ఆ మెరపు తీగను చూడగానే అతడి మనస్సులో కాంచన రూపం తళుక్కున మెరసింది.

తేరుకొని చూచేలోగా ఆమె కారు ఎక్కేసింది. ఆమెతోనున్న నడివయస్కుడు కారును బయల్దేరదీస్తున్నాడు. అది విదేశీ వాహనం. ఆ వ్యక్తుల వేషాలుకూడా ఖరీదైనవే.

"చూడండీ, ఇది మీరు చూసుకోకుండా యిచ్చేసి నట్టున్నారు" అన్నాడు మాధవ్ సమీపంగా వెళ్ళి.

"ఫర్వాలేదు వుంచు" అన్నాడతడు.

"ఇహిహీ. ఏదైనా కొనుక్కో. పాపం చొక్కా కూడా లేదు నీకు" వెకిలిగా నవ్వుతూన్న ఆ సుందర రూపం వేసి అయోమయంగా చూశాడు మాధవ్. 'ఈ మెరపుతీగ పిచ్చిదా? భగవాన్, ఏమి నీ చిద్విలాసం?'

కారు స్టార్టు అయినట్లే అయి ఆగిపోయింది.

ఆ తర్వాత అరగంట, గంటకూడా గడిచింది కాని అతడివల్ల కాలేదు. బర్ మన్న శబ్దం రావటం, ఆగిపోవటం మినహా స్టార్ట్ కావడం లేదు. తన జ్ఞానం మేఱకు ఏదో సరి జేయ ప్రయత్నించాడు చాలాసేపు. ఏమాత్రం లాభం లేక పోయింది.

"బలే అయితే మనం ఇక్కడే గుళ్ళో పడుకోవాలా నాన్నా? కారు పాడైపోయిందిగా మరి?" అతడి పిచ్చి కుమార్తె అడుగుతోంది.

"తప్పమ్మా, అంటువంటి మాటలనకూడదు. బాగై పోతుంది వెళ్ళిపోదాం" అంత చికాకులోనూ ఓర్మిగా సమా ధానం చెప్తున్నాడు.

మరో రెండుకార్ల డ్రైవర్లు వచ్చి తమ శాయశక్తులా ప్రయత్నించి విఫలులయ్యారు.

"లాభం లేదండి, షెడ్డులో ఒప్పజెప్పాల్సిందే మెకానిక్‌కి. అయినా, ఇంతదూర ప్రయాణం డ్రైవర్నెందుకు తెచ్చుకోలేదు మీరు?"

ముసలాయనలో స్పష్టంగా ఆందోళన ద్యోతకమైందీసారి.

"ఎక్కడికి వెళ్ళాలండి తమరు?" అంతా చూస్తున్న మాధవ్ ప్రశ్నించాడు.

అతగాడు చెప్పాడు.

"అబ్బో చాలా దూరమేనే!" దగ్గర జేరిన డ్రైవర్లూ, మరో అయిదారుగురు వ్యక్తులూ గుండెలు బాదుకున్నారు.

మాధవ్ అడిగాడు సంకోచిస్తూ : "నాకు...బాగా తుందేమో ప్రయత్నించి చూడనా బాబుగారూ?"

అనుమానంగా, ఆశ్చర్యంగా చూచారు కారు యజమానీ, చుట్టూవున్న జనమూకూడ. "బికారివి, నీ కసలు కారంటే ఏమిటో తెలుసా?" అన్నట్లున్నాయి ఆ చూపులు.

వారి ఊహలను గ్రహించినట్లుగా అన్నాడు మాధవ్:

"కార్ల విషయం కొంచెం తెల్సు బాబుగారూ నాకు. మీరు అనుమతించితే...ప్రయత్నించి చూస్తాను."

"సరే చూడు" సందేహిస్తూనే అంగీకరించాడతడు.

అందరికీ ఆశ్చర్యం గొలిపేట్లుగా అరగంటలో బాగు చేసి, కారు స్టార్టుచేస్తూ "ఇక మీరు హాయిగా వెళ్ళొచ్చు బాబుగారూ" అన్నాడు మాధవ్.

ఆ యజమాని కన్నులలో కృతజ్ఞతతోపాటు గౌరవం కూడా కన్పట్టింది.

"మరలా దారిలో ఏమి ఇబ్బంది పెడ్తుందో! వెంట రాగలవా కాస్త? రేపు తిరిగి వచ్చేద్దువుగాని."

"తమ దయ" ఆనందంగానే అంగీకరించాడు మాధవ్.

"పద పద రేపు ఉదయం తిరిగి వచ్చేద్దువుగానిలే."

తండ్రీ కూతురూ ఎదుటకూర్చున్నారు.

వెనుక సీటులో కూర్చున్న మాధవ్ ఆలోచనలు పరి పరివిధాల పరుగిడసాగాయి, బాట ప్రక్క దృశ్యాలు పరుగిడినట్లే.

'ఇంజనీరు పట్టం తీసుకున్నా ఇంజనీరునూ, ఉద్యోగిని కాలేకపోయాను. కోరినవనితను వివాహమాడలేకపోయాను తలిదండ్రులకూ తోబుట్టువులకూ కూడా దూరమయ్యాను. ఇక

నేను ఏమయితేనేం? ఏ నౌఖరీ చేస్తేనేం రోజులు గడిచి పోవటానికి? అసలు ఏమి చేయకపోతేనేం? బ్రతకపోతే నేం?" ఎంత ధైర్యం చెప్పుకొన్నా అప్పుడప్పుడు ఇటువంటి నిరాశానిస్పృహాలుతప్పవ్...అలా కాదు, ఎలాగైనా సాధించు తాను. నన్ను విదిలించిన నలుగురికీ నేనూ ప్రయోజకుడినే ననీ, వాళ్ళకంటే తక్కువ కాననీ నిరూపించుతాను.'

దారిలో ఒక హోటల్ ముందు కారాగింది.

"భోజనంచేసి వెళ్దాం." అన్నాడు జనార్దనరావు.

మాధవ్ కారు దిగి, తిరిగి దాని దుమ్ముదులుపుతూ అక్కడే ఒదిగి నిలబడటం చూచిన అతడు మరలా వెనక్కు వచ్చి, "ఏమోయ్! ఆకలివెయ్యటం లేదూ? రారా. అన్నం తిని వెళ్దాం" అన్నాడు.

"మీరు చేసిరండి బాబుగారూ. నేనిక్కడ వుంటాను." తల ఒంచుకుని మెల్లగా చెప్తున్న మాధవ్ తీరునూ, ఆ అభి మానాన్ని పరీక్షగా చూచిన జనార్దనరావు పసికట్టేశాడు. 'ఇతడెవరోఅయినింటివాడూ లజ్జాభిమానాలున్నవాడూతప్ప అల్లాటప్పవాడు కాదని.' పరికించి చూడగా మాధవ్ రూపు రేఖలుకూడా అతడికి ఉన్నతమైనవిగా కన్పట్టసాగాయి.

"దా. అన్నం దగ్గర సిగ్గుపడితే పనిచేయటానికి ఓపిక

ఎలావస్తుంది?" సస్నేహంగా భుజంపై చేయివేసి ఆదరంగా లోనికి తీసుకు వెళ్ళాడు జనార్దనరావు.

మాధవ్ కూడా లోలోపల ఆయనను అంచనా వేసు కుంటున్నాడు కృపామయుడుగా, గౌరవమన్ననలుగలవ్యక్తిగా.

"నేను నడుపుతాను బాబుగారూ, మీరు కొంచెం విశ్రాంతి తీసుకోండి. ఫర్వాలేదు. నాకు డ్రైవింగ్ బాగానే వచ్చును." అన్నాడు మాధవరావు భోజనానంతరంబయల్దేరు తూండగా.

"సరే." అన్నాడు జనార్దనరావు ఏమాత్రం సంకోచం లేకుండా.

"నువ్వు ఇక్కడ పడుకో తల్లీ రత్నా. బాగా అలసి పోయావ్" అంటూ కుమార్తెను పసిపిల్లను బుజ్జగించినట్లు బుజ్జగించి లాలించి వెనుకసీట్లో పరుండజేశాడు.

భోజనం దగ్గరకూడా రత్న చాలా హంగామా చేసింది. అయినా, ఎంతోఓర్పుగా తినిపించాడు జనార్దనరావు సినిమా కబుర్లూ కథలూ చెప్తూ. 'ఎంత ఓర్పు ఈయనకు! ఇంతటి ఐశ్వర్యవంతుడై కూతురి పిచ్చిని మాన్పుకోలేకుండా వున్నాడా?' అన్పించింది అంతా గమనించిన మాధవ్ కు.

పసిబిడ్డలా పడుకొని నిద్రపోయింది రత్న.

మాధవ్ డ్రైవింగ్‌ను కనిపెడుతూ ప్రక్కనే కూర్చున్నాడు జనార్దనరావు.

"ఏంపని చేస్తుంటావ్ నువ్వు?" వున్నట్లుండి అడిగాడతడు.

"ఏపనీ లేదండి ప్రస్తుతం, పని వెతుక్కుంటున్నాను."

"ఓహో! అయితే...అసలేంపని చేస్తుంటావ్?" అప్రయత్నంగా అబద్ధమాడేశాడు మాధవ్. "ఒకటిరెండు చోట్ల డ్రైవరుగానే చేశానండి. జీతం తక్కువా, పైగా నానాచాకిరీ చేయించేవారు."

"అలాగా?"

"ఔను బాబుగారూ, మీ దగ్గర ఏదైనా పనివుంటే ఇప్పించండి. నేనే అడుగుదామనుకుంటున్నాను. నాకేమీ అత్యాశలేదు. నా జీవితం గడిచిపోయేట్టు జీతం యిప్పించి, నన్నో మనిషిగా చూడగలిగితే చాలు."

పకపకా తేలికగానవ్వేశాడు జనార్దనరావు. "అంతేనా? ఇంకేం ఆశలులేవా?"

మాధవ్ మాట్లాడలేదు. ఊపిరి బిగబట్టి ఎదురు చూస్తున్నాడు అతడి సమాధానానికై. సిగ్గూ అభిమానం చంపుకొని, విద్యా వ్యక్తిత్వమూ విస్మరించి సగంచచ్చి దేని

రించినట్టే అడిగాడు. ఈ తళుక్కుమనినఒక్క ఆశాకిరణమూ వదులుకోలేక. ఇదికూడా దుర్లభమైతే ఏమిటిగతి?

ఇల్లుజేరగానే ఓ పదో ఇరవయ్యో చేతిలోపెట్టి పొమ్మనడుగదా!

కారు భవంతిని జేరింది.

"నేను కొన్ని ముఖ్యమైన పనులు చూచుకుంటాను ఆఫీసుకు వెళ్ళి. ఉదయం తీరికగా మాట్లాడుకుందాం. పగ లంతా నువ్వూ అలసిపున్నావ్. శుభ్రంగా భోజనంచేసిపడుకో హాయిగా, ఏమీ దిగులు పెట్టుకోకు" అని మరి మాధవ్ మాట వినకుండానే, అతడి బాధ్యతను ఒక నౌఖరుకు ఒప్ప జెప్పి వెళ్ళిపోయాడు జనార్దనరావు.

"దేవేంద్రభవనం అంటే యిలాగేవుంటుందికాబోలు!" అన్పించింది మాధవ్‌కు. పెద్ద భవనం, చుట్టూ పూలతోట, సర్వెంట్స్ క్వార్టర్స్, చకచకా పనులు చేసుకుపోతూన్న నౌఖర్లు, కుక్కలు-ఓహ్, ఏమి వైభవం!

"ఇవిగో బట్టలు. అదుగో స్నానాలగది. అయ్యగారు వచ్చేసరికి శుభ్రంగా తయారు కమ్మన్నారు." ఒక నౌఖరు కాబోలు చెప్పాడు. ఆశ్చర్యమైంది మాధవ్‌కు, నౌఖర్లు ధరించే దుస్తులు కావవి. మంచివి. క్రొత్తవి. జనార్దనరావుపై

సద్భావం ఇనుమడించిం దతడికి మనసులో. 'కాస్త కారు రిపేరు చేసినంత మాత్రాన యింత గౌరవమా.'

బెరుకు బెరుకుగా వున్నది మాధవ్‌కు. ఎక్కడ నిల బడాలో ఎవరితో మాట్లాడాలో ఏమీ తెలియకుండా వుందతడికి.

వరండాలో నిలబడిన అతడికి రత్న కుక్కపిల్లతో ఆడుకుంటూ అటుగా రావడం కన్పించింది. ఆమెకూడా అతడినిచూచి దగ్గరకువచ్చి "చూశావా మా యిల్లు? బాగుందా?" అనడిగింది.

"చూశానండి. చాలా బాగుంది." మాధవ్ సమా ధానం.

"ఏమిటా మంతనాలు? ఇటురా!" ఏదో పెళపెళమని విరిగినట్లున్న ఆ కటువైన స్వరంవిని ఉలికిపాటుతో అటు చూశాడు మాధవ్.

వంటయింటివసారాలోనుండిక్రోధంగాచూస్తూ,తప్పని సరిగా పిలుస్తూన్న ఆ గంగా భగీరథీ సమాన అనసూయ నామధేయ, జనార్దనరావుకు దూరబంధువు. కొడుకు కోదం డంతో సహా ఆ యింట తిష్టవేసి వంటపనీ వగైరా అజ మాయిషీ చేస్తూ, ఆడదిక్కులేని ఆ యింటికి తానే అధికా

రిణిగా ఊహించుకుంటూ, జనార్ధనరావు ఆస్తిని ఎప్పుడు ఎలా కబళించుదామా అనే పథకాలు వేస్తూంటుంది. అందుకే అందరినీ అలా కసురుకుంటూ కాట్లకుక్కలాగా వుంటుంది ఎప్పుడూ. క్రొత్తమనిషినిచూస్తే మరీ గుర్రుమంటుంది.

"ఏమిటే పిచ్చిదానా నీ వెధవసొద? పో నీగదిలోకి" రత్నను కసిరింది అనసూయ.

భయంగా చూస్తూ రత్న వెళ్ళిపోయింది, దీనమైన ముఖంతో.

"పాపం !" అన్పించింది మాధవ్‌కు రత్నపై జాలితో.

"ఏమిటలా చూస్తావ్? ఇదుగో. అన్నంతిను ఇక్కడ తిండికేం కొదవా? దారినపోయే ప్రతిదానయ్యా మెక్కిపో వటమేగా?" అనసూయ మాటలకు అన్నం తినాలన్పించక పోయినా కడుపులో ఆకలి దంచుతోంది. 'అయినా ఆయన పెట్టమన్నారు. ఈవిడ ఎవరోమరి-ఇలా విరిచినట్లు మాట్లా డ్తోంది. పోనీయ్! కుక్క మొరగటం యజమాని నేరం కాదుగా? కుక్కమీద కోపగించి యజమానిని కాదను కుంటామా?' అలా సాగిపోతున్నాయి మాధవ్ ఆలోచనలు.

అనసూయమ్మ అసలే అసహనానికి పేరు. "అయ్యో ఖర్మ! చెముడా ఏమిటి నీకు? భోజనం చెయ్యి" గట్టిగా అరచింది.

మాట్లాడకుండావచ్చి భోజనంచేయసాగాడు మాధవ్.

"క్రొత్తాడల్లే వున్నాడు ఎవడమ్మా యితడూ?" అప్పుడే బయటనుంచి వచ్చిన కోదండం కోరగాచూస్తూ అడిగాడు.

"ఏమో, ఎవరో? నీమామ కార్లోనే వచ్చాడు. ఈ పిచ్చిదాన్ని తీసుకుని గుళ్ళోకెళ్తాడుగా శుక్రవారం శుక్రవారమూనూ? ఆ మతిలేనిదానికోసం పోతే అక్కడ ఈ గతి మాలినాడు తారసిల్లాడు కాబోలు!"

"ఐసీ!" ఈలవేశాడు. "ఈ పిచ్చిదానికి ఝుడిసి ఏ డ్రైవరూ నాల్గురోజులకంటె వుండడు. తెలియనివాడు కదా అని జాగ్రత్తగా పట్టితెచ్చినట్లున్నాడు పాపం ఈ పూర్ ఫెలోని. నాల్రోజుల్లో వీడూ కాలికి బుద్ధిచెప్తశూ!" అని పకపకా నవ్వేస్తూ పోయాడు కోదండం.

ఈ కన్పిస్తూన్న మనుషులనూ వారి వాగుడునూ జాగ్రత్తగా గమనించుతూ ఆ యింటి పరిస్థితులను ఆకళింపు చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు మాధవ్. 'ఈ ఇంట తన కెటువంటి నౌఖరీ లభిస్తుంది? నిజంగా కోదండం అన్నట్లే పారిపోవలసి వస్తుందా? ఏనో వయసుకు తగని వెకిలిమాటలు మినహా పాపం రత్న మరీ అంత ఘోరమైన పిచ్చిదానిలాగ ఏమీ కన్పించడంలేదే?'

భోజనానంతరం ఏంచేయాలో తోచక ఒక్కడూ ఆవరణలో మొక్కలదగ్గర కూర్చున్నాడు మాధవ్.

"ఏం బాబూ? క్రొత్తగా అన్పిస్తోందా?" ఆదరంగా పలుకరిస్తూ వచ్చి దగ్గర కూర్చున్నాడు తోటమాలి. చూడ గానే సహృదయుడివలె కన్పించాడు.

నవ్వి ఊరుకున్నాడు మాధవ్.

"అయ్యగారు దానకర్ణులు మంచిమనసు." చుట్ట వెలిగిస్తూ అన్నాడు తోటమాలి. "ఎవరి కష్టం చూడలేరు. అందుకే ఇలా బంధువులందర్నీ యింట్లో పెట్టుకున్నారు. హాయిగా ఆయన నీడను బ్రతుకుతూ, వెనక ఆయనకే గోతులు తీస్తున్నారు. ఈ అనసూయమ్మ మరీనూ. అయ్య గారికి కాస్త దగ్గరచుట్టం కావడంతో తనదే ఇల్లన్నట్టుగా మాట్లాడ్తుంది. ఆ మొఖాన్నిచూచి భయపడిపోకు బాబూ. బుద్ధిగా మసలుకున్నావంటే అయ్యగారు నీ బతుకంతకి ఏదో ఓదారి చూపుతారు."

వృద్ధుని మాటలు వింటూంటే బ్రతుకుపై కోరికా, భవిష్యత్తుపై ఆశా జనించాయి మాధవునికి.

అలా మాట్లాడుకుంటూంటే, ఎంతసమయం గడిచిందో తెలియలేదు. గేటువద్ద గూర్ఖా అటెన్షన్‌లో నిలబడ్డాడు.

జనార్దనరావు కారు దూసుకువచ్చి ఆగింది. ఒక నౌఖరు పరుగెత్తి వచ్చి కారు తలుపుదీసి పట్టుకున్నాడు. తోటమాలీ అతడితోపాటు మాధవరావూ లేచి చేతులు కట్టుకు నిలబడ్డారు.

"ఎవరదీ? ఓ మాధవ్ ! నిద్రపోలే?" జనార్దనరావు అడిగాడు.

"లేదు బాబుగారూ." వినయంగా అన్నాడు మాధవ్.

"రా నాతో."

జనార్దనరావు వెంట లోపలికి ప్రవేశించిన మాధవ్‌కు మూర్ఛవచ్చినంత పనైంది ఆ గదుల వైభవమూ, తీరూ చూచి. 'జనార్దనరావుగారు కోటీశ్వరులా?'

"భోజనం చేశావా?" నడుస్తూనే అడిగాడు.

"చేశానండి మీ దయవల్ల."

రెండు పెద్దపెద్ద హాలులుదాటి డైనింగ్ హాల్‌లో అడుగుపెట్టాడు.

సంకోచిస్తూ దూరంగా నిలబడి చూడసాగాడు మాధవ్.

"రావోయ్ ఏం ఆగిపోయావేం ?" కుర్చీలో కూర్చుంటూ పిల్చాడు జనార్దనరావు "రా అలా కూర్చో."

మాధవ్‌కుకూడా ఎదుటికుర్చీచూపినా అతడు కూర్చోలేదు. చేతులు కట్టుకునే నిలబడ్డాడు.

అనసూయమ్మ అజమాయిషీలో వంటమనిషి పదార్థాలన్నీ బల్లమీద పెట్టాడు. "ఏడెవరూ, మన క్రొత్త డ్రైవరా?" అనడిగింది. వినవట్లే "ఒక ప్లేట్ అయిస్‌క్రీమ్. ఒక గ్లాసు మేంగోలా కూడా." అన్నాడు జనార్ధనరావు. ఆజ్ఞ వింటూ ఫ్రిజ్ మూసివేస్తున్న వంటమనిషి ఆశ్చర్యంగా చూశాడు.

అనసూయమ్మ కనులలోకూడా ఆశ్చర్యం కన్పట్టింది. "రాత్రిళ్ళు అవి తీసుకోవుగా అన్నయ్యా నువ్వు?"

"నాకు కాదులే, త్వరగా." అంటూ "అరే! ఇంకా నిలబడేవున్నావ్ కూర్చో మాధవ్. ఎదుటివాళ్ళని నిలబెట్టి నేనసలు మాట్లాడలేను. నేను అన్నం తిన్నంతసేపూ అలాగే నిలబడతావా ఏం?" అన్నాడు.

ఇక కూర్చోక తప్పలేదు మాధవ్‌కు.

అనసూయమ్మ ముఖంలో క్రోధం, అసహనం పెనవైచుకొని నాట్యమాడాయి. "నీకు మరీ ఏమీ తెలియదన్నయ్యా, అయినది ఆకులోనూ కానిది కంచంలోనూ అన్నట్టుచేస్తావ్. ఈ ముక్కూ ముఖం తెలియని అడ్డమైన వాళ్ళనీ లోపలిగదుల్లోకి తీసుకురావడమే కాకుండా సరీ

సాటిగా కుర్చీల్లో కూర్చోబెట్టడంకూడా మొదలుపెట్టావా?"

తీవిగా అర్థయుక్తంగా నవ్వుతూ "మొదటినుండి నా అలవాట్లు అవేగా?"

భావయుక్తమైన ఆ మాటల అర్థం అనసూయమ్మకు బాగానే గ్రహింపు అయింది. మొఖం మాడిపోయినా అరం కానట్లే నటించింది. వెంటనే తేరుకుని, "సాయంత్రం కారు నడుపు కొస్తే క్రొత్త డైవరేమో అనుకున్నాను. ఇప్పుడు వంటింట్లోకొస్తే క్రొత్త వంటవాడేమో అనుకున్నాను. చెప్పక పోతే నాకెలా తెలిసి చస్తుంది? అయినా ఆ గుడ్డలూ, ఆ వాలకంచూచి అంతకంటె అనుకోలేను మరి నేను" అన్నది ఈసడింపుగా. అభిమానం,ఆత్మగౌరవంఅనేవి ఆమె నిఘంటువులో బొత్తిగా లేవు. ఎవరెంత అసహ్యించుకుంటున్నా తాను వాగదలచుకున్నది వాగేస్తేకానీ బ్రతకలేదు.

అంతా వింటూన్న మాధవ్ ముఖం అభిమానంతో భూమిలో కృంగిపోయింది.

"నువ్వు గుడ్ బై చెప్తేకానీ, మరో వంటవాడికోసం చూడదల్చుకో నక్కర్లేదుగా అనసూయా?" నవ్వుతూనే అతడన్నప్పటికీ అనసూయ ముఖం మలినమైంది.

"మామయ్యా. మీతో ఓ ముఖ్యవిషయం చెప్పాలి." హడావుడిపడ్తూ వచ్చాడు కోదండం.

విసుగా చూచాడు జనార్దనరావు. "ఇప్పుడుకాదు. వెళ్ళు. వెళ్ళండి అందరూ. ఇక నాకేం వడ్డించనవసరంలేదు."

రావు ఎంత సాధారణంగా అందర్ని ఎంత ఆదరంగా చూచినా ఆజ్ఞమాత్రం ఆజ్ఞే!

తప్పనిసరిగా అందరూ నిష్క్రమించారు.

"తీసుకో మాధవ్." ఐస్‌క్రీంప్లేటుమాధవ్‌కుఅందిస్తూ "త్వరగా కానీయ్" అన్నాడు.

అందుకున్నాడు మాధవ్. కాని ఏమిటో ఆలో చిస్తున్నాడు. రావు భోజనాని కుపక్రమించాడు.

కొద్దిసెకండ్లు గడిచాయ్.

"ఏమిటా ఆలోచన? కరిగి నీరైపోయాక తింటావా?"

ఆ మాటలకు కొద్దిగా సిగ్గుపడ్తూ తిన నారంభించాడు మాధవ్. "చాలా మామూలు వాడిని నేను. మీరు నాకు తగని మర్యాదలు చేస్తున్నారు బాబుగారూ. నాకు చాలా సిగ్గుగా వున్నది." అన్నాడు మెల్లగా.

జనార్దనరావుమాట్లాడలేదు. భోజనంచేస్తూ నేవున్నాడు.

మాధవ్ చేతిలోప్లేటు ఖాళీ అయింది.

"ఇదికూడా తీసుకో" రావు మేంగోలా అందించు తూంటే మాధవ్ సిగ్గుతో ముడుచుకు పోయాడు.

"ఇప్పుడు చెప్పు. నువ్వేం చదివావ్?"

కొంచెం తడబడి సర్దుకున్నాడు మాధవ్ "చెప్పుకో తగ్గ చదువేంలేదు బాబుగారూ. చిన్న నౌఖరీ ఏదైనా యిప్పించండి. మీ మేలు మఱచిపోను."

జనార్దనరావు వదనం ఒక్క-సారిగా గంభీరంగా మారి పోయింది. భోజనం ఆపి మాధవ్ దెస నిశితంగా చూస్తూ అన్నాడు.

"చూడు మాధవ్ నేనుచాలాసూటిగా పోయేవ్యక్తిని. అబద్ధాలువద్దు, నిజంచెప్పు. ఎందుకు నిన్ను నువ్వే కించపఱచు కుంటావ్?"

కలవరపడిన మాధవ్ సర్దుకు కూర్చున్నాడు. పారి పోయిన ధైర్యాన్ని మఱలా బలవంతంగా పట్టితెచ్చు కున్నాడు. "నేను నిజమే చెప్తున్నాను సార్! ఎందుకలా అంటున్నారు మీరు? నేను మోసగాడినికాను సార్. మీరే చిన్న నౌఖరీయిచ్చినా విశ్వాసంగా చేస్తాను."

"నీవంటి వాడికి నా దగ్గర చిన్న నౌఖరీలులేవు!"

శిరస్సుపై పిడుగుపడ్డట్లయిందిమాధవ్‌కు.హఠాత్తుగా

లేచి నిలబడ్డాడు "సా...ర్?" అంతకంటె మాట్లాడలేక పోయాడు నిరాశవల్లి.

భోజనం ముగించి చేయికడుక్కున్నాడు రావు. తాపీగా కుర్చీలో వెనక్కివాలుతూ, సూటిగా మాధవ్ వదనంలోనికి నిశితంగా చూస్తూ అన్నాడు! "నువ్వు ఇంజనీర్ వి కావా?"

ఎట్టెదుట సింహమో, భల్లూకమో నిలబడినట్లే అనుభూతి జెందిన మాధవ్ మాటలుడిగి చేష్టలుదక్కి శిలాప్రతిమవలె నిలబడ్డాడు.

"నా కారుకు వచ్చిన ట్రబుల్ మామూలు మెకానిక్ బాగుచేయగలది కాదు. నాకు తెల్సు!"

మాధవ్ లో చలనంలేదు. ఘోరమైన తప్పిదం చేసినవాడు శిక్ష కెదురుచూస్తూ. నిస్సహాయంగా నిలబడి నట్లున్నదతడి తీరు.

"నీ తెలివి చూచాను. నీ డ్రైవింగు చూచాను. నీ భోజనపద్ధతి చూచాను. నీ ఆత్మాభిమాన్నాని చూచాను. నన్ను అబద్ధాలతో నమ్మించలేవు మాధవ్. చెప్పు ఏమిటి నీ సమస్య?" లేచి మాధవ్ దగ్గరగా వెళ్ళాడు.

మాధవ్ శరీరాన్ని వణుకూ, గుండెను దడా ఆవరించాయి.

"భయపడకు మాధవ్" అని ఆదరంగా అతడు భుజం తడుతూంటే ఆ ఏడుకొండలవాడు అభయమిచ్చినట్లే అన్పించింది మాధవ్‌కు.

"నన్ను క్షమించండి సార్." అన్నాడు అవనత శిరస్కుడై, తన స్వరం తానే వినలేనంత నెమ్మదిగా.

"ఫర్వాలేదు. దాపరికంలేకుండా చెప్పు అన్నీ. నీకు నేను ఉద్యోగం ఈయాలని నిన్ననే నిశ్చయించుకున్నాను. కాని వివరాలు నేను వినితీరాలి."

కొన్ని నిముషాలు మౌనం రాజ్యపాలన చేసింది.

"నేను ఆటోమొబైల్ యింజనీరింగ్ ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యాను. కాని పట్టా ఎందుకూ పనికిరాకపోయింది. ఉద్యోగంలేక అందరికీ అసమర్ధుడిగా కన్పట్టసాగాను. ఉన్న పొలంలో సగం అమ్మి, నా చదువుకే వ్యయం చేయడంవల్ల నాపై పెట్టుకున్న పెద్దఆశలన్నీ వ్యర్థమై కన్న తల్లిదండ్రులు కూడా అసంతృప్తిని ప్రకటించడంతో విరక్తిజెంది, ఒంటరిగానే నా అదృష్టాన్ని వెతుక్కుంటూ ఈ విశాల విశ్వంలో అడుగు పెట్టాను...

"నా డిగ్రీకి తగిన ఉద్యోగంలేదు, రాదు. పైగా అది చిన్న నౌఖరీలు యివ్వాలనే సద్బుద్ధిగలవారిని భయ

స్తున్నది. అందువల్ల మీవద్ద అబద్ధమాడవలసి వచ్చింది. డిగ్రీ లేకపోతే డ్రైవరుగానైనా, దర్వాను గానైనా, కడకు వంటవాడిగానైనా బ్రతకవచ్చని భావించాను బాబుగారూ! నన్ను క్షమించండి. తెలివీ, సమర్థతా వుండికూడ అందరికీ బరువై, అసమర్థుడిగా చూడబడడం—ఎంత నరకసదృశమైన బాధో — ఆగర్భశ్రీమంతులైన మీకు తెలియదు బాబుగారూ."

మాధవ్ నేత్రాలలో, స్వరంలో ప్రపంచంలోని దైన్యమంతా వర్షించుతూండడం గమనించిన జనార్దనరావు ద్రవించిపోయాడు. గంభీరంగా నవ్వుతూ అన్నాడు! "శ్రీమంతులకు కూడా చాలా బాధలుంటాయి మాధవ్. ఆ బాధలేమిటో నువ్వు ఊహించనుకూడా ఊహించలేవు. బాధ రుచి తెలిసినవాడే ఎదుటివారి బాధను తెల్సుకోగలడు!" అంటూన్న జనార్దనరావులో అంతవరకూ లేని మరో రూపాన్ని ఆశ్చర్యంగా చూడసాగాడు మాధవ్.

"సరే. సరే. అందతా వదిలేయి." తిరిగి గంభీరంగా మారిపోయాడు జనార్దనరావు. "రేపు మన ఆఫీసు, వర్క్‌షాప్ అన్నీ చూద్దువుగాని. తొమ్మిదికల్లా మనం యింటి దగ్గర బయలుదేరాలి రోజూ."

"...నా సర్టిఫికేట్సేవీ చూస్తారా సార్?"

"అవన్నీ తర్వాత. నీవు నా కారుకు చేసిన రిపేరే నీకు పెద్ద సర్టిఫికెట్. ఇక నువ్వు దేనికీ తాపత్రయపడకు. ఏర్పాట్లన్నీ నేనే చేస్తాను. ఇక్కడేవుండువుగాని."

"బాబుగారూ!!" కృతజ్ఞతను భాషారూపంలో వెల్లడించలేక ఆశ్చర్యవిస్ఫారిత నేత్రాలతో చూడసాగాడు.

ఒక గుమాస్తాను పిలిచి "చూడూ, మన గెస్ట్ రూమ్స్‌లో ఒకటి ఈయనకియ్యి. ఎప్పుడేం కావాలో చూస్తూ కనిపెట్టివుండు, ఏమీ లోపం జరగకూడదు."

ఇటు మాధవరావుకూ అటు గుమస్తాకుకూడా కళ్ళు తిరిగిపోతున్నాయి.

ఆధునికి సౌకర్యా లన్నింటితో అతి నవీనంగావున్న ఆ గదిని చూచి విస్మయంతో నిలబడిపోయాడు మాధవ్. "ఎక్కడ తాను?" ఎంత నిరాశ అనుభవించాడు! ఒక్కసారి అదృష్టచక్రం ఎలా తిరిగింది!

తనకే నమ్మశక్యంగాకుండా వున్నది.

ఫోంబెడ్‌పై హాయిగా నిశ్చింతగా నిదురపట్టవలసినది పోయి, భయంతో అతడు నిశ్చింతగానిదురించలేక పోయాడు. 'నిదురనుండి మేల్కాంచేసరికి యిదంతా స్వప్నమై చెదిరి పోతే? వద్దు భగవాన్ వద్దు; ఇది నిజంచేయి. యింతకంటె

ఏమీ కోరను. ఈ విషయం తెలిస్తే కాంచన ఎంత సంతోషిస్తుంది. ఎంత ఉప్పొంగిపోతుంది! ఇదంతా కాంచన అదృష్టమే. ఆమె పూర్వజాఫలమే! ఇక ఎలా కాదనగలడు మామయ్య? సిగ్గుపడి క్షమాపణలు కోరుతూ మా పెళ్ళి జరిపించేయడూ?'

ఊహా లోకాలలో తేలిపోతూ, భవిష్యత్తును గురించి బంగారుకలలుకంటూ జాగారం చేశాడు తెల్లవార్లూ.

"హమ్మయ్య, ఇది కలకాదు. నిజమే." అని గుండె సవరించుకున్నాడు. తెలతెలవారుతుండగానే ప్రత్యక్షమైన నౌకరును చూచి,

"దైవం వున్నాడా" అనుకున్నానుకానీ, నిజంగా దైవం కృపామయుడు. తనంతతాను పిల్చియిచ్చినట్లుగా వున్నది ఉద్యోగం. ఎంత చిత్రం?

తనను తానే అభినందించుకుంటూ, దైవాన్నీ దైవం చూపిన జనార్దనరావునూ పదేపదే మనసున కీర్తించుకుంటూ త్వరత్వరగా లేచి కాలకృత్యాలను ముగించుకున్నాడు.

"లోపలికిరావచ్చా" అంటూ గుమాస్తా ప్రవేశించాడు. ఆతనివెంట టెయిలర్. "మీకు డ్రెస్సెస్ ఆర్డరిచ్చాము. కొలతలు..." అని అతడంటూండగానే టెయిలర్ త్వరత్వరగా తన పని ముగించుకుని వెళ్ళిపోయాడు.

గుమాస్తావల్ల వివరాలు కొంతవరకు తెల్సుకోగలిగాడు. ఆటోమొబైల్ స్పేర్ పార్ట్స్ తయారుచేసే పెద్దఫ్యాక్టరీ నడుపుతున్నాడు రావు.

"అందులో తనకొక బాధ్యతాయుతమైన పదవిని ఈయబోతున్నారన్న మాట జనార్దనరావుగారు! ఆహా తంతే బూరెలగంపలో పడ్డట్లైంది తన సంగతి. తన అసహాయతను గమనించి, పదవికి తగిన దుస్తులుకూడా ఆయనే కుట్టించబోతున్నారన్నమాట. ఏనాడు చేసిన పుణ్యమో. కొండవంటి అండ దొరుకుతూన్నది!"

# 7

"కాంచనా!"

గోపాల్ పిలుపువింటూనే కలవరంతో చూచింది కాంచన. నవవధువు అందరివలె భర్త సమక్షంలోఆనందమూ అలరింపూ లభించవామెకు. భర్తరాకకొరకు ఆనందంగా నిరీక్షించదు ఆమె. అతడువచ్చే టైమౌతున్న కొలదీ గుండె దడతో భయంతో ముడుచుకుపోతుంది.

"ఏమిటి చేస్తున్నావ్?"బూట్లు విప్పుకుంటూ కుర్చీలో కూలబడ్డాడు.

"ఏమీలేదు. కాఫీ తెస్తాను." లేవబోయింది.

"తెస్తారులే ఎవళ్ళో. నువ్వే వెళ్ళాలా ఏమిటి?" నారాయణమూర్తికోరికపై గోపాల్ అత్తవారింట్లోనేవుంటున్నాడు.

"మీ నాన్నగారు యింట్లో వున్నారా?"

"ఆఁ."

"నాకో నాలుగువేలు అర్జంటుగా కావాలి. అడిగి తీసుకురా."

"నిన్న నేకదా రెండువేలు తీసుకున్నారు? మళ్ళీ..."

వెంటనే గోపాల్ ముఖం క్రోధంతో జేవురించింది. "ఏం. లెక్క అడుగుతున్నావ్? సమయానికి నా డబ్బు అందక అడగవలసివచ్చింది. గతిలేని వాణ్ణనుకున్నావా?"

"ఎందుకలా రెచ్చిపోతారు? నేనలాగ అన్నానా?"

"మరి ఏమిటి నీ మాటల అర్థం? వెళ్ళు వెంటనే తీసుకురా."

కాంచన కదలలేదు.

"ఏం? పెంకెతనం చేస్తున్నావా?" కటువుగాఅడిగాడు.

"చూడండీ." అనునయస్వరంతో అన్నది కాంచన "మన పెళ్ళై రెండు నెలలైనా కాలేదు. పెళ్ళికి డెభై వేల రొక్కం యిచ్చారు మీకు. ఇవిగాక పెళ్ళిఖర్చులు ఎన్నో!"

"ఓ!" వికటంగా అన్నాడు. "పోనీ, పెళ్ళిమానుకుంటే వదిలిపోనుగా? డబ్బూ, కూతురూకూడ చక్కగా ఇంట్లోనే వుండేవి మీ నాన్నకి?" కాంచన ఓర్పుకోల్పోలేదు.

"మీారలా పెడసరంగా మాట్లాడితే నేను చెప్పగలిగే దేముంటుంది?"

"అసలు నిన్ను చెప్పమని ఎవడేడిచాడోయ్?" గింజు కుంటూన్నట్లు అన్నాడు "వెధవ నాలుగువేలకు నీ లెక్చరు విన వలసిన ఖర్మపట్టిందా నాకు?"

కాంచన చలించలేదు అతడి కేకలకు. "పెండ్లి అయిన తరువాత ఈ రెండునెలల్లో— నిన్నిటి రెండూవేలూ కలిపి ఆరువేలుతీసుకున్నారు మీారు. రోజూ వేలుకావాలంటేఎక్కడ నుంచి తేగలరు? ఎంత నాన్న అయితేమాత్రం నేను ఏముఖం పెట్టుకు అడగగలను?"

"ఏమీా దానంగా అడగటంలేదు నేను. మళ్ళీ మొగాన పారేస్తానులే."

"ఎందుకలా మాట మీారుతారు? నేను అడగలేను రోజూ." ఖచ్చితంగా చెప్పేసింది కాంచన.

"మంచిది." సవాలుగా అన్నాడు. "అడగకు. సర్దుకో నీ బట్టలూ వస్తువులూ అన్నీ."

అర్థంగానట్లు చూచింది.

"వినిపించలేదా ఏం చెప్పానో? వేరే యింటికి పోదాం పద. నాయిల్లంటూ నాకుంటే బాగుంటుంది. నీ బాబుయింట్లో

వుంటున్నానని తలకుమాసినవాడిని చూచినట్లు చూద్దామను కున్నావేమో! ఆ గతిమాలిన వాడిని కట్టుకుంటే నీ పొగరణిగి వుండేది. డాక్టర్ మొగుడు విలువ తెలియక నీల్గుతున్నావ్."

కేకలువిన్న కేశవరావ్ వచ్చాడు. "ఏమిటి గోపాల్ హడావుడీ?" అంటూ.

ఇంటి అల్లుని హోదావచ్చిన తర్వాత తనకూ కేశవ్‌కూ గల స్నేహంకూడా మఱచిపోయి దర్జా వెలగబెట్టటానికి చూస్తున్నాడు గోపాల్. కేశవరావుకూడా ఈ విషయం గమ నించకపోలేదు.

"ఏమిటో నీ చెల్లెల్నే అడుగు, ఉపన్యాసాలిస్తోంది. ఉపన్యాసాలు!" దూకుడుగా బట్టలుసర్దుకుంటున్న గోపాల్‌నూ విషణ్ణవదనంతో మౌనంగా నిలబడినచెల్లెల్ని మార్చి మార్చి చూశాడు కేశవ్.

"ఏమిటో నాకు చెప్పు గోపాల్, చిన్నపిల్ల-దాని మాటలకేమిటిలే. తెలిసీ తెలియనితనం!" అన్నాడు దగ్గరకు వెళ్ళి భుజంపై చేయివేస్తూ.

"ఔనౌను. తెలిసీ తెలియనితనం పాపం! ఎంత బాగా వెనకేసుకొస్తున్నావ్ చెల్లెల్ని! చేసేవి పెద్దపనులూ, అనేవి పెద్దమాటలూ, పేరుకుమాత్రం చిన్నపిల్ల!"

నిశ్శబ్దంగా కంటతడి పెడుతూ నిలబడింది కాంచన.

"అత్తింట్లోవుండేఅల్లుడు వెధవలాగా చూడబడతాడని నాకు తెల్సు. తెలిసుండీ యిలా మీరు అడగగానే యిక్కడున్నందుకు చాలు ఈ అవమానం. నేను వేరేయింటికి పోతున్నాను. పంపదల్చుకుంటే నీ చెల్లెల్ని పంపించు నా వెంట. ఇష్టంలేకుంటే ఇక్కడే వుంచుకో."

"చాల్లే కబుర్లు. ఎక్కడికి వెళ్తావ్ వేరే." చనువుగా అతడిచేతిలో పెట్టె లాక్కున్నాడు కేశవ్. "ఏమిటో సంగతి అసలు నాకుచెప్పు?"

గోపాల్‌కు కావలసిందికూడా అదే. వేరే యిల్లూ బాధ్యతలూ అనేవి అతనికసలు పడవు. ఏదో నామకార్థం ఓ భార్య—అందమైన భార్యవున్నది. పైపై జల్సాలకు అడిగినంతా యిచ్చే బంగారుబాతులాంటి మామగారున్నాడు. ఆ నీడన ఎన్ని ఆటలైనా ఆడవచ్చుకాని భార్యనూ సంసార భారాన్నీ ధర్మాలనూ నెత్తికెత్తుకొని భరించగల ఓర్మీ, శక్తీ కూడా లేవు అతడికి.

"నీ మాట త్రోసివేయలేక మానుకుంటున్నాను కేశవ్." అని అయిష్టంగా కూర్చున్నట్లు కూర్చున్నాడు గోపాల్ "ఈ వెధవ హాస్పిటల్‌లో యిచ్చే గొర్రెతోక లాంటి - జీతాలతో ఎన్నాళ్ళు పడుండను కేశవ్. స్వంత

ప్రాక్టీస్‌కు అన్నీ ఏర్పాటు చేసుకొని ఈ ఉద్యోగం మానివేయా లనుకుంటున్నాను. అందుకే ఒక్కో అపరేటస్‌కే వ్రాస్తు న్నాను. నా ఫ్రెండు ఒకడు లండన్ వెళ్తున్నాడు. కొంత ఆపరేటస్ అతడు అక్కడ కొని పంపిస్తాడు. అందుకే ఓ నాల్గు వేలు తెమ్మన్నాను, మీనాన్నగార్ని అడిగి. అసలు నాకు కావలసింది ఆరువేలైనా నాలుగే అడిగాను. అందుకే నీచెల్లెలు నానామాటలూ అంటున్నది.”

భార్యను నాలుగువేలే అడిగినవాడు కేశవ్ పుత్త బడటం చూచి అప్పటికప్పుడు అంకెను ఆరుకు వ్రాకించాడు.

ఎగిసివస్తూన్న నిట్టూర్పును బలవంతంగా ఆపుకున్నాడు కేశవ్. గోపాల్ మాటలు ఎంతనిజమో అతడికి తెల్సు. అయినా వేరు గత్యంతరం లేదు. మాట్లాడకుండా గంట లోగా ఆరువేలూ తెచ్చి అతడి చేతికిచ్చాడు.

డబ్బు తీసుకుని సంతోషంగా ఈలవేసుకుంటూ వెళ్ళి పోయాడు గోపాల్. నిశ్శబ్దంగా విలపిస్తూన్న చెల్లెలి ముఖం చూడలేకపోయాడు కేశవ్.

“నన్ను క్షమించు కాంచనా, నిన్ని నరకంలోనికి త్రోసినవాడను నేను. డాక్టరు – విదేశాలలో చదివి వచ్చాడు. ఎంతో గొప్పగావుంటుంది నీ జీవితం అతనితో,

అనుకున్నాను కానీ ఇలాంటివాడని నా కసలు తెలియదు వివాహోత్సూర్వం. నన్ను తిట్టుకోకు కాంచనా."

విరక్తితో భారంగా నవ్వింది కాంచన "నా ముఖంరాత ఎవరు తప్పించగలరులే అన్నయ్యా. అంతా నా ఖర్మ. మీరెవరూ బాధ్యులుకారు."

కేశవ్ చాలాతడవు ఏదో ఆలోచిస్తూవుండి, తర్వాత మెల్లగా అన్నాడు: "ఈ డబ్బంతా తీసుకెళ్ళి ఏంచేస్తున్నట్టు? నీకేమైనా తెలుసా కాంచనా?"

కాంచన అతడివేపు చూడకుండానే అన్నది "నాకంటె ఆయన వినరాలూ అలవాట్లూ నీకే బాగా తెలియాలి!"

ఆ చెప్పుదెబ్బవంటి సమాధానానికి సిగ్గిలిపోయాడు కేశవరావు. "అలా కోపగించుకోకు కాంచనా. తెలిసుంటే చేజేతులా చెల్లెల్ని ఈ నరకంలోనికి తోస్తాననుకున్నావా? నిజంగా అతడు ప్రాక్టీసు ప్రారంభించటానికి ఏర్పాట్లు చేసు కొంటూంటేమాత్రం అది సంతోషించదగ్గ విషయమే!"

విసురుగా లేచింది కాంచన కూర్చున్న తావునుండి, "మిమ్మల్ని నిరుత్సాహపరచటం, బాధపెట్టడం నా అభిమతం కాదన్నయ్యా. కాని ఎక్కువకాలం మీరు ఈ భ్రమలో వుంటే ఇల్లంతా గుల్లకావటమూ సర్వనాశనమూ తప్పదు.

అందుకే చెప్తున్నాను. ఇదుగో చూడు” అంటూ గాడ్రేజ్ అల్మారా తాళంతీసి తలుపు బార్లా తెరచింది.

అసంఖ్యాకమైన నాగుబాములను చూచినట్లుగా నిస్ప్రాణంతో స్థాణువై పోయాడు కేశవ్. ఇన్నన్ని తరహా తరహాల మత్తుపానీయాలుంటాయని అతడికి తెలియనుకూడా తెలియదు. ఏదో కొద్దిగా త్రాగే అలవాటు వుంటే వుండ వచ్చుగాక- ఈ రోజుల్లో చాలామందికివుంటోంది అటువంటి బుద్ధి. అయితే ఇలా అన్నీ తెచ్చి ఇంట్లో ఏ పుస్తకాలో బొమ్మలో పేర్చినట్లు అందంగా నిర్భయంగా అల్మారా నింపివేయడమే? అదీ-అత్తవారింట్లో?

“ఇదిగో యివిచూడు” ఓ కవరు అందించింది. యాంత్రికంగా తీసుకుచూచిన కేశవ్ కనులు ధారాపాతంగా వర్షించసాగాయి.

అతడినంత బాధకు గురిచేసిన కారణం ఆ కవరులో గోపాల్, మరోయిద్దరు యువకులూ-మిత్రులు కావచ్చు- ఏడెనమండుగురు నవనాగరిక యువతులూ విచ్చలవిడిగా అర్థ నగ్నంగా ఆడుతూ పాడుతూ ఏదో పిక్నిక్ లో తీయించుకున్న ఫొటోలు. ఆ యువతులలో గోపాల్ పనిచేస్తూన్న హాస్పి టల్ నర్సులుకూడా యిద్దరున్నారు

"అయితే ఇప్పుడు తీసుకెళ్ళిన డబ్బుకూడా..." అర్థోక్తిలోనే వదిలేశాడు కేశవ్ తన అనుమానాన్ని.

కాంచన మాట్లాడలేదు.

"చెప్పు కాంచనా. నేను వెళ్ళి వాళ్ళతో ఏమైనా మాట్లాడతాను. కొడుక్కి కాస్త బుద్ధులు చెప్పుకుంటారు, చనువుగా."

"పేడనీళ్ళు జల్లుతారు ముఖంమీద" ఏహ్యంగా అన్నది కాంచన.

"అదేమిటి?"

"ఇది చూడు నీకే తెలుస్తుంది. ఇవాళ పోస్టులోనే వచ్చింది." ఆ ఉత్తరం అందించింది.

"చిరంజీవి గోపాల్‌కు—

...ఉభయకుశలోపరి, ఇక్కడ మార్వాడీ ఒత్తిడి చాల ఎక్కువగా వుంది. ఎలాగైనా ఓ పదివేలు వెంటనే సర్దవలెను. పొలం మీదవున్న అప్పు యాభై వేలూ తీరింది. ఇంటిపైఅప్పు ఇంకా నలభై వేలు తీర్చవలసివుంది. లేకపోతే పొలం వేలంవేస్తానని మార్వాడీ రోజూ బెదిరిస్తున్నాడు. ఇంకా నీ చెల్లెలి పెళ్ళిబాధ్యతవున్నది మననెత్తిపై. ఇవన్నీ దృష్టిలో వుంచుకొని నువ్వు వీలైనంతవరకూ ఈ మొత్తం సర్దటానికి బందోబస్తు చేయాల్సింది.

నీ జవాబుకు డబ్బుకు ఎదురుచూస్తూంటాను. అత్త వారింట వుంటున్నావన్న అలుసు కలుగనీయకుండా గౌరవం కాపాడుకొమ్మని మీ అమ్మ వ్రాయమన్నది. ఇంతేసంగతులు. నీవు మళ్ళీ విదేశాలు వెళ్ళే ఉద్దేశ్యంలోవున్నట్లు వ్రాశావు. ఎప్పుడు ప్రయాణం? వివరంగా అన్నిసంగతులతో జవాబువ్రాయి.

మీ తండ్రి, శంకరం."

"కళ్ళతో చూడనిదే యిలా ఒకతండ్రి కొడుక్కి రాయగలడని నేను నమ్మకనేపోదును. అసలు కోడలికి ఆశీర్వచనాలేలేవు. కోడలి క్షేమసమాచారాల అజేలేదు. ఎందుకొచ్చిన పెళ్ళి. ఏటి పల్లానికి? ఛీ." ఛీత్కరించుకుంటూ ఆ ఉత్తరాన్ని తిరగాబోర్లావేసి చూచిన కేశవ్ మరింత ఆశ్చర్యమూ అసహ్యమూ ప్రకటించాడు. కారణం దానిపై హాస్పిటల్ అడ్రస్ వ్రాయబడి వుంది.

"ఎంతటి నీచత్వమూ నిర్లజ్జా? భార్యకు తెలియకుండా మరొక అడ్రస్‌కు ఉత్తరాలా? రాసేవాడికి బుద్ధిలేదు. రాయించుకొనేవాడికీ అభిమానంలేదు. ఛీ, భార్యను యింత పరమ శత్రువునుగానా చూడటం? ఇలాంటి ఆటలు

సాగవని నువ్వు గట్టిగా చెప్పు కాంచనా, ఆ తర్వాత నేను చూసుకుంటాను. ఏదైనావస్తే!"

"ఏమిటి చూసుకుంటావ్?" హేళనగా అన్నది కాంచన. "ఇటువంటి పెళ్ళిచేశాక ఎవరుచేయగలిగిందీ ఏమీ లేదు. ధనదాహమున్న దెయ్యాలకు నన్ను మీరు దానం చేశారు. నరునికి చేయలేదు కన్యాదానం!" భోరుభోరున విలపించింది కాంచన ఇక నిగ్రహించుకోలేక.

అంతవరకూ మౌనంగావున్న కేశవ్ భార్య సీత అన్నది: "జరిగిందేదో జరిగిపోయింది. ఇక ఒక్క పైసా ఈయటానికి వీల్లేదు. ఎవళ్లెవళ్ళ కోసమో నన్నూ నా బిడ్డలనూ బికార్లను చేస్తారా అందరూ కలిసి?"

సీతమాటలు అసత్యమేమీకాదు! అందుకే కేశవ్ మాట్లాడలేదు.

వెర్రిదానిలా చూచింది కాంచన. ఇక ఆ యింట తన గతీ గౌరవం ఏ దశకు మారబోతున్నాయో గ్రహించుకున్నదామె. "ఇక యిది తన పుట్టిల్లుకాదు తాను ఈయింటికి పరాయిది." అని గ్రహించుకొన్న ఆమె నిలువెల్లా ఒణికింది.

"సుఖశాంతులులేని ఇటువంటి జీవితాన్నెందుకు ప్రసాదించావు భగవాన్? నేను చేసిన పాపమేమిటి? కన్నీసం-

నా బావకైనా ఇటువంటి ఇడుములు కలుగకుండా కాపాడు!"

"ఎక్కడున్నావ్ బావా? నీ హృదయం మంచిది. నీకు దుర్గుణాలు లేవు; ధన దాహం లేదు. నువ్వు తప్పక సుఖపడ్తావ్. సుఖపడాలి!" నిండు హృదయంతో ప్రార్థించింది.

# 8

"డియర్, కాంచనా

నా ప్రాణమా, ఏమని రాయను? ఎంత సంతోష వార్త రాస్తున్నాను నీకు ? అదేమిటో చెప్పనా ! ముందు ఇది చెప్పు. నువ్వు నాకోసం బెంగపెట్టుకున్నావా ? కోప గించుకున్నావా? నాకు తెల్సులే డియర్! నీవు నాపై కోపం తెచ్చుకోవు. ఎవరెంత ఆగ్రహించినా, రోజూ దైవానికి మొక్కుతున్నావ్ కదూ "బావ త్వరగా రావాలి. బావకు ఉద్యోగం దొరకాలి. ఆ తర్వాత నేనూ బావా పెళ్ళిచేసు

కొని హాయిగా నందనవనసీమలలో..." అనీ, వచ్చేసింది డార్లింగ్. ఆరోజు దగ్గరకొచ్చేసింది. నా నిరీక్షణ ఫలించింది. నీ ప్రార్థన దైవంవిన్నాడు. ఔనా? వివరాలు సమక్షంలో చెప్తాను. అందరికీ చాటిచెప్పు-మా బావ పెద్ద ఉద్యోగస్థుడై వచ్చేస్తున్నాడని. అప్పుడిక ఎవళ్ళకూ నోరెత్తే అవకాశమే వుండదు. సెలవు దొరకగానే వచ్చి వాల్తాను.

ఈ లోగా...అమ్మాయీ, కలలుకంటూ వుండూ...

నీ ప్రాణం"

వ్రాసిన ఉత్తరాన్ని మరలా మరలా చదివి చూచు కుంటూ, ఆనంద లోకాలలో విహరిస్తూన్న మాధవ్‌కు తలుపుపై టకటకలు వినరాగానే ఎంతైనా చీకాకు వచ్చింది 'ఇంత ప్రొద్దున్నే ఎవరో!'

"యస్" అన్నాడు అయిష్టంగానే.

"బట్టలు తెచ్చేశాను బాబయ్యా" అంటూ చాకలి ప్రవేశించాడు.

"అక్కడపెట్టి వెళ్ళు."

"చిత్తం."

"ఇదిగో చూడూ ఈ లెటర్ పోస్టుచేయి."

"అలాగే బాబూ"

ఉత్తరం వెళ్ళిపోయింది.

ఆరోజు సంక్రాంతి. ఫ్యాక్టరీకి సెలవు. అందువల్లనే బద్ధకంగా అటు ఇటు ద్రొల్లుతూ ఆ ఉత్తరం అందుకు చదివి కాంచన ఎటువంటి చిత్రవిచిత్రానుభూతులు పొందు తుందో ఊహించుకుంటూ చాల తడవు గడిపివేశాడు.

"ఏంచేస్తున్నారూ?" ఎంతో స్నేహమున్నదానివలె అడుగుతూ రత్న వచ్చి తనంత తానే ఒకకుర్చీలో తీరికగా ఆశీనురాలైంది.

ఇక లేవక తప్పలేదు మాధవ్‌కు. అదీ, చాలా ఖంగా రుగా, సాధారణంగా అతడు రత్ననూ అనసూయమ్మనూ తప్పుకు పారిపోతుంటాడు. కారణం రత్న విసిగించదు కానీ యిబ్బందికరంగా ప్రవర్తిస్తుంది. పద్దెనిమిదేళ్ళున్నా మూడేళ్ళ దానికంటే హీనంగా వెకిలిగా ప్రవర్తిస్తుంది. ఇక అన సూయమ్మ వడగాల్పులాగా భయపెడ్తుంది వడనడా వాగుతూ.

కానీ యిప్పుడు రత్న తనంతతానుగా నేరుగా లోప లికి వచ్చేసింది. ఇక పారిపోయే దారి కన్పించలేదు మాధ వ్‌కు.

"నడవండి. అలా వరండాలో కూర్చుందాం." అన్నాడు.

"ఎందుకూ? ఇది మా యిల్లే. నా యిష్టమొచ్చిన చోట కూర్చుంటాను."

"ఓ! ఔనౌను."

"అన్నట్లు మీరు మా యింట్లోనే వుండిపోతారా యిక?"

మాట్లాడలేదు మాధవ్.

"తెలీదా?" అదోకలా చూసింది! "నాకూ ఏమీ తెలియదట లెండి అందరూ అంటారు" మాటలు ముగియకుండానే ఆమె దృష్టినేదో ఆకర్షించింది.

"ఎంత బాగున్నారో వీళ్ళు!" అంటూ, అంతకుముందే చాకలి అక్కడుంచిన బట్టలకు చుట్టిన పాత వార్తా పత్రికను తీసి చూడసాగింది. ఆమె ఆ పత్రిక నలా లాగడంలో క్రింద పడిపోయిన తన బట్టలను తీసి సర్దుకోసాగాడు మాధవ్.

"చూడండి, వీళ్ళెంత బాగున్నారో!" ఆ పేపరును మాధవ్ కళ్ళకు దగ్గరగా పెట్టింది తెచ్చి. "నా పెళ్ళి అయితే కూడా యిలాగే ఫొటోలు పేపర్లో వేస్తానని మా నాన్నగారు అన్నారు!"

అప్రయత్నంగా ఆ ఫొటోను చూచిన మాధవ్ కళ్ళు తిరిగిపోయాయి. భూమ్యాకాశాలు బ్రద్దలౌతున్నట్లుగా,

ప్రళయ వీచికలు చెలరేగినట్లుగా భయ బాధావిహ్వాలుడై మతిచాంచల్యం కలిగిన వాడిలా అలా కళ్ళు నిలబెట్టి చూస్తుండిపోయాడు.

"కాకూడదు. అలా కాకూడదు" అనుకొంటూ సకల దైవాలనూ ప్రార్థిస్తూ రత్న చేతిలోని పేపరు క్రింది వివరాలు చూడబోయాడు. అయితే, దయామయుడనబడే దైవం ఒక్కొక్కప్పుడు ఎంత నిర్దయుడుగా ప్రవర్తించి నిర్లజ్జగా అపహసిస్తాడు!

చిరంజీవి సౌభాగ్యవతి కాంచనను చిరంజీవి గోపాల్ యం. బి. బి. యస్. కు; మూడు నెలలనాటి పేపర్ అది!

"భగవాన్! ఎంత ఘోరం జరిగిపోయింది! ఎంత నిర్దయగా ఆడుకుంటున్నావ్ నా జీవితంతో! నా కాంచన... నా ప్రాణం...నా దేవతకు పెళ్ళైపోయిందా? ఇక నాకు కాంచన పరాయిదైపోయిందా? ఇక ఎవరికోసం ఈ తాపత్రయం? ఇక ఎందుకీ బ్రతుకు? నాదెంత మొండిప్రాణం! నా కాంచనకు మరొకరితో వివాహమైపోయిందని తెలిసీ ఇంకా ఈ బొందిలో ప్రాణం ఎలా నిలబడి వుంది?

అవధులను మించిన దుఃఖావేశంతో అనిర్వచనీయమైన అచేతనావస్థలో శిలాసదృశుడై కాలగమనాన్నే గమనించకుండా వెర్రిచూపులు చూస్తున్న మాధవ్, అనసూ

యమ్మ సుడిగాలిలా ప్రవేశించడం కూడా గమనించలేదు. కాని కొంతసేపటికి కరకరలాడుతూన్న ఆమె కంఠధ్వని అతడిని ఈ ప్రపంచంలోనికి దింపి తెచ్చింది.

"తరగనాస్తి వుందనీ ప్రతి తలకిమాసిన తద్దినాన్నీ తెచ్చి నెత్తికెక్కించుకొంటే ఏమౌతుంది? ఇవాళ ఇద్దైంది రేపింకొకటౌతుంది. అవ్వ అవ్వ" నోరు నొక్కుకుంటూ నోరు పారేసుకుంటూన్న కారణమేమిటో తెలియక భయపడుతూ గది నాల్గువైపులకూ దృష్టి సారించాడు మాధవ్.

మాధవ్ మంచంపై కులాసాగా హాయిగా పడుకొని ఏదో బొమ్మల పుస్తకం చూసుకొంటోంది రత్న.

"లే రత్నా, రా బయటికి" రత్నను రెక్కపట్టి ఈడుస్తోంది అనసూయ. అయినా రత్నలో చలనంలేదు. "అబ్బ నువ్వు పో, తర్వాత వస్తాను. ఈ బొమ్మల పుస్తకం చాలా బాగుంది." పుస్తకంలో తల్లీనమైపోయిన రత్న ఆమెవైపైనా చూడకుండా విసుక్కుంటూ జవాబిచ్చింది.

"ఛీఛీ, సిగ్గూ శరంలేదు! ఎందుకొచ్చిన ఏళ్ళు! అదంటే వెర్రిది, ఏం తెలీదు. లక్షణమైనవాడివి నీకేం దుర్బుద్ధి యిది! వయసొచ్చిన పిల్లని గదిలోపెట్టుకుని గుడ్లప్పగించి చూస్తున్నావా? తిన్నింటికే వాసాలు లెక్కపెట్టే రకాలన్నీ కొంపమీదికొచ్చిపడ్డాయి."

అప్పటికి పరిస్థితి ఏమిటో గ్రహించిన మాధవ్ నిలువునా నీరుగారిపోయి ఏమీ మాట్లాడలేక, ఏదో మాట్లాడబోయి మరలా నేలచూపులు చూస్తూ వూరుకున్నాడు. కాంచన పెళ్లి ఫొటో చూచినందున అతడి అంతరంగంలో రేగిన అగ్నిజ్వాలలకు ఈమె తూష్ణీభావం మరింత ఆజ్యం పోసినట్లయింది.

"అసలు తప్పు జనార్దనరావుది. అడ్డమైనాళ్ళనీ ఇంట తెచ్చి మేట్లువేసి మేపడం..."

"అనసూయా !!!"

ఎప్పుడు వచ్చాడో జనార్ధనరావు హుంకరింపుకు భవనమే దద్దరిల్లింది.

"అది కాదన్నయ్యా..." అనసూయ సగంచచ్చి ఏదో చెప్పబోయింది కానీ అతడు వినలేదు.

తర్జని చూపుతూ బయటకు పొమ్మన్నట్లు సౌంజ్ఞ చేశాడు.

మరి చేసేదిలేక అనసూయమ్మ మెల్లిగా బయటికి జారుకుంది.

అంతవరకు సవిలాసంగా, నిర్మలంగా పడుకొన్న

రత్న అప్పటికి లేచింది. పుస్తకం బల్లమీద పెడ్తూ, "చాలా బాగున్నాయండీ మీ పుస్తకాలు. నేను రోజూ వచ్చి చూచుకుంటాన్లే!" అంది మాధవరావుతో.

మాధవరావు నేలచూపులు చూస్తున్నాడు. జనార్దనరావు ఎదుట అతడికి తలవంపులుగా వున్నది. అత డెలా అర్థం చేసుకున్నాడో కదా?

"నాన్నా, మాటిమాటికీ నన్ను విసుక్కుంటావ్ ఏమీ చదువుకోవడంలేదని. అనసూయమ్మని ముందు ఏదైనా మంచి స్కూలుకి పంపించు. బొత్తిగా డిసిప్లిన్ లేదు. కుక్కకంటె గట్టిగా అరుస్తుంటుంది ఎప్పుడూ" తండ్రికొక అయాచిత సలహా పారేసి వెళ్ళిపోయిం దక్కడినుంచి.

అపరాధివలె బలవంతంగా తలెత్తుతూ అన్నాడు మాధవరావు. "అమ్మాయిగార్ని నేను ... వరండాలో కూర్చోమని అన్నాను కాని ఆమెగారు వినలేదు సార్..." ఇంకా ఏదో చెప్పబోయాడు కానీ అతడికి చెప్పాలన్పించలేదు. 'ఎందుకింత తాపత్రయం ఈ మిథ్యా ప్రపంచంలో బ్రతకటానికి?' అనే విరక్తి అతడి మనసున ప్రవేశించి అప్పటికప్పుడే వ్రేళ్లూని శాఖోపశాఖలతో మహావృక్షంగా విస్తరిల్లిపోయింది. కాంచన పెండ్లి ఫోటో చూచిన అతడికి గొంతువరకూ దుఃఖం ఎగదన్ని వుంది. తేలికగా నవ్వేస్తూ

జనార్ధనరావు, "ఏమిటోయ్ మాధవ్! మళ్ళీ నువ్వు నాకు ఎక్స్‌ప్లెయిన్ చేయాలా? లీవిట్. ఆవిడ స్వభావమే అంత!" అన్నాడు.

"బాబుగారూ." మెల్లగా అడిగాడు మాధవ్. "ఒక్క మనవి. మీరేమీ అనుకోవద్దు. మన బాచిలర్స్ స్టాఫ్ వుండే హాస్టల్‌లోకి నేను మకాం మార్చుతాను."

లోకంలోని దీనత్వమూ, నైరాశ్యమూ నెలవు చేసుకొన్నట్లున్న ఆ వదనం చూచి గుండె తరుక్కుపోయింది జనార్దనరావుకు.

"మాధవా!" దగ్గరగా వచ్చి భుజం తడుతూ అన్నాడు "ఏమిటోయ్ యిది! టేకిట్ ఈజీ నెవర్ మైండ్, ఆవిడ తీరే అంతని చెప్పలేదూ నేను!"

"అదికాదు సార్. నేను దూరంగా ఉండడం అన్ని విధాలా మంచిది."

"నో, నో. ఏది మంచిదో చెప్పాల్సినవాడిని నేను. వాళ్ళందరూ కాదు. ఇలా యింకెప్పుడూ జరగదని నేను మాట యిస్తున్నాను. సరేనా? ఇక నువ్వు మాట్లాడకు. నువ్వు ఇక్కడే ఉంటావ్." అంటూ అప్పటికప్పుడు మళ్ళీ అనసూయమ్మను అక్కడికి రప్పించాడు.

"అదికాదన్నయ్యా, నా మాట విను..." ఆమె ఏదేదో వివరించబోయింది కానీ జనార్ధనరావు అసహనం, అయిష్టత చూపాడు. వినలేదు.

"నా మాట నువ్వు విను" అన్నాడు భయంకర గాంభీర్యంతో. "నేను గౌరవించి మన్నించే వ్యక్తిని తప్పని సరిగా నువ్వు గౌరవించి తీరాలి. తెలుసా ?"

"అదికాదన్నయ్యా..."

"హుష్" మరింత అసహనంతో, క్రోధ స్వరంతో వారించాడు జనార్దనరావు ఆమెను. "మాధవరావుగారి విష యంలో నువ్వెన్నడూ అగౌరవంగా ప్రవర్తించటానికి కానీ మాట్లాడటానికి గానీ వీలులేదు" అన్నాడు "గారు" అనే పదాన్ని ఒత్తిపలుకుతూ.

"మాధవరావుగారు!" లోలోన మనసు మండిపో తున్నా పైకి మాత్రం "అలాగేలే అన్నయ్యా. అందరి ఎదుటా నన్ను అవమానిస్తావనుకోలేదెన్నడూ" అంటూ రాని కన్నీటిని చీర చెఱగుతో ఒత్తుకుంటూ నిష్క్ర మించింది.

"ఆహాహా, "న" లోపించితే అనసూయమ్మ సార్థక నామధేయ ఔతుంది" అన్నాడు జనార్ధనరావు వాతావర ణాన్ని తేలికచేసే ఉద్దేశ్యంతో.

మాధవ్ ముఖం యింకా భూమికి అంటుకుపోయినట్లే ఉన్నది.

"మాధవ్! ఏమి టలా వున్నావ్?" ఒక కుర్చీలో కూర్చుంటూ అడిగాడు జనార్ధనరావు.

"నీకు మీ వాళ్ళంతా జ్ఞాపకం వస్తున్నట్లున్నారు. కావాలంటే ఓ వారం రోజులు వెళ్ళిరా మీ ఊరు. ఏ వూరన్నావ్ మీది?"

చెప్పాడు మాధవ్.

"ఇల్లదీ ఏర్పాటు చేస్తాను. ఫామిలీని తెచ్చుకో, నీ యిష్టం."

మరొక పరిస్థితిలో అయితే ఎగిరిగంతేసి వుండును మాధవ్. కానీ రెక్కలు విరిగిన పక్షి చందమైనది నేడతని జీవితం. స్వప్నజగతిలో ఆనందగీతిక లాలపించిన మనసులోని ఉత్సాహ సంతోషాలు ఒక్కసారిగా ఎడారిలో నీరువలె యింకిపోయాయి.

"అమ్మా, నాన్నగారూ అక్కడే వుంటారు సార్. ఇంకా తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ వున్నారు. కొద్దిపాటి పొలం వుంది వారెక్కడికీ కదలరు. ఇంకెవరూ లేరు నా కొఱకు ఇక్కడికి వచ్చేవారు. అవివాహితుడను." ఎంత మామూ

లుగా చెప్పాలనుకున్నా అతడి కంఠం గద్గదంకాక మాన లేదు.

అతడిని ఏదో మానసికావేదన దొలిచివేస్తూన్నదని గ్రహించగలిగిన జనార్దనరావు కొద్దిక్షణాలు అలా చూచి అన్నాడు: "సరే. కాని నీకేం అవసరమైనా మాత్రం చెప్పు. సందేహించకు. నీకు పెళ్ళయి, ఫామిలీని తెచ్చుకునేవరకూ మాత్రం నివాసం యిక్కడే! గుర్తుంచుకో."

విరక్తిగా నవ్వుకున్నాడు మాధవ్. "ఇక తనకీ జన్మకి పెళ్ళి ప్రసక్తి లేదు!"

# 9

"కాంచనా"

వివాహానంతరం ఏనాడూ వినని ఈ ప్రేమ సంబోధనకు కొంచెం ఆశ్చర్యపోతూ చూచింది కాంచన.

చాలా ప్రేమగా వచ్చి పక్కలో కూర్చుంటూ అడిగాడు గోపాల్.

"భోజనం అయిందా ?"

"ఆఁ." 'ఏమిటో సంగతి ఇంతగా తన ఆలనాపాలనా కావలసి వస్తున్నది!' అనుకొన్నది లోలోన.

"అలా ఎక్కడైనా వెళ్దామా ? చాలారోజులైంది మనం బయటకు వెళ్ళి."

"ఏం, ఇవాళ ఇంత తీరిక లభించింది ?" మామూలుగానే అడిగింది.

"ఏముందీ, ఈ రోజు అంతగా వర్కు లేదు. అయినా పోనిద్దూ వెధవ వర్కు. అస్తమానం పనో పనో

అని యంత్రాల్లాగా మన సుఖాలు చూచుకోవటం మర్చి పోతున్నాం."

అతడి స్వార్థం, నైచ్యం అన్నీ ఈసరికి బాగా అవగతమైన కాంచన ఈ పైపై వగలకు కరిగిపోకపోయినా "నడవండి" అంటూ వెంటనే తయారై బయలుదేరింది.

అలా పదిరోజులు అతడు 'అసలు గోపాలేనా' అని కాంచన ఆశ్చర్యపోయేటంతగా ప్రేమాదరణలు కురిపించాడు.

'యేమో భగవంతుడు కృపామయుడు. నా భర్త మనసుమారి అతడిలో నా యెడల గౌరవం ప్రేమా అంకురించాయేమో ?' అనుకొన్నది కాంచన.

ఇటీవల కీచులాటలేవీ లేకుండా, అల్లుడు చిరబుర మనకుండా కూతురితో అన్యోన్యంగా వుండటం గమనించిన అత్తమామలు కూడా కాస్త సంతోషించారు.

"త్వరగా తయారుకా కాంచనా, ఒక స్నేహితుడు వస్తున్నాడు. రెండ్రోజులు మనకు అతిథులుగా ఉంటారు" అన్నాడు ఒకనాడు గోపాల్ హడావుడిపడిపోతూ.

"అలాగే" అంగీకరించింది కాంచన.

"మనం స్టేషన్‌కి వెళ్లి తీసుకొద్దాం వాళ్ళని- చాలా

పెద్ద పొజిషన్‌లో వున్నాడులే... అన్నట్టు మీ అమ్మగారికి కాస్త చెప్పిరా.”

“ఏమనీ ?”

“ఇలా రెండ్రోజులు అతడూ భార్యా మన ఇంట్లో వుంటారని. చెప్పకపోతే వారి కేమైనా అంభ్యతరా లుండ వచ్చుకదా !”

లోకమే తలక్రిందులైనంత ఆశ్చర్యం కల్గింది కాంచనకు. ఇష్టానుసారం నిర్లజ్జగా ప్రవర్తించే ఇతడికి ఈనాడు యింత నమ్రతా! అత్తమామల అనుజ్ఞ కావలసివచ్చిందా? ఏమి టిందలి రహస్యం ?

రైలు దిగుతూనే ప్రేమలు పొంగిపొర్లగా ఆప్యాయంగా కౌగలించేసుకుంది అనిత గోపాల్‌ను. ఆమె భర్త వినోద్ సామానులు దింపించిన తర్వాత మెల్లగా వచ్చి చేయి కలిపాడు గోపాల్‌తో. “హల్లో” అనుకున్నారు ఇద్దరూ, ఒకరి కనులలోనికి ఒకరు చూచుకుంటూ. గోపాల్ తనతో వర్ణించి చెప్పిన స్నేహమేమీ వినోద్‌తో కలిగి వున్నట్లుగా అన్పించలేదు కాంచనకు. మీదు మిక్కిలి అతడి భార్య వచ్చి పరపురుషుడైన గోపాల్‌తో పట్టపగలు అంత

మంది జనాభాలో అలా మీదపడి విపరీతంగా ప్రవర్తించ టంతో కాంచన కొయ్యబారినట్లే అయిపోయింది.

వేషమూ, భాషే కాక ఆ పిల్లి కన్నులూ, రాగి జుట్టూ స్పష్టంగా చాటిచెప్తున్నాయి. అనిత విదేశీయురా లనీ, హైందవి ఎంతమాత్రమూ కాదనీ! ఏమిటేమిటో బడాబడా వాగేసింది అనిత గోపాల్‌తో. అంతగా ఆంగ్ల భాషా పరిజ్ఞానంలేని కాంచనకు అదేమీ అర్థంకాకపోయినా అది స్నేహసంబంధీకమైన పరిభాషగా మాత్రం అన్పించ లేదు. అసలు ఆ ముగ్గురూ స్నేహితులుగానూ కన్పట్టంలేదు కాంచనకు. కాంచన వునికిని వారంతా విస్మరించినట్లుగా కూడా అన్పించిందామెకు.

చాలసేపటికి "కాంచనా, ఏమిటంత పరధ్యాన్నం?" అని గోపాల్ తన భుజం తట్టాంటే జాగ్రదవస్థకు వచ్చిన కాంచన "ఆఁ. ఏమిటి?" అన్నది నీరసంగా.

"ఏమిటలాగున్నావ్? చాలా కాలానికి కల్సుకున్నాం కదూ? అంచేత మాటల్లోపడి... ఏమిటో నిన్ను పరిచయం చేయడమే మర్చిపోయాను. హిహిహి...విదేశీయులు కదూ. అంచేత వాళ్ళ పద్ధతులు నీకు క్రొత్తగా వుంటాయి. నేను విదేశాల్లో వుండి అలవాటుపడిపోయాననుకో." అడక్కుం డానే సంజాయిషీ చెప్పుకుంటూ వెకిలినవ్వు నవ్వుతూన్న

భర్తను చూస్తే వెగటుగా చీమలూ జెర్రులూ పాకుతూన్న ట్లుగా అన్పించింది కాంచనకు.

"హల్లో!" అన్నది తమాషాగా కనుబొమ ఎగర వేస్తూ అనిత.

తన పద్ధతిలో ముక్తసరిగా "నమస్తే" అన్నది కాంచన. మగవాడ్ని పైబడి ఆలింగనం చేసుకోగల ఆమెకు తనతో కరచాలనం జేయటానికి కూడా బాధేనా?

వినోద్ మాత్రం విదేశీయునివలె లేడు. కాంచన సందేహం గమనించినట్లుగా అన్నాడు గోపాల్. "వాళ్ళది "లవ్ - మ్యారేజ్"లే. అతడు భారతీయుడే. పంజాబీ వాడు."

మొత్తంమీద కాంచనకు ఏమిటో తనకే తెలియని బాధానుమానాలు మనసులో రేగి అనిర్వచనీయమైన అశాంతి తినివేయసాగింది.

గోపాల్ ప్రవరాఖ్యుడేమీ కాదనీ, సార్థకనాముడనీ ఆమె వివాహానంతరం కొలదిరోజులకే గ్రహించింది. పరాయివ్యక్తులపట్ల కూడని ప్రేమసంబంధాలు కలవాడే నిష్కారణంగా స్వంత భార్యనూ ఇంటినీ ద్వేషిస్తూ చిరబుర లాడతాడని కూడా ఆమెకు తెల్సు. అయితే అతడు నేడు

అనితతో ప్రవర్తించిన నిర్లజ్జాపూర్వకమైన తీరు కళ్ళారా చూచిన ఆమె మనసు 'ఇతడు విదేశాలలో యింత విచ్చలవిడిగానే విహరించివచ్చిన వీరుడా?' అని పరిపరివిధాల చింతించసాగింది.

"ఇదేమిటీ కలగాపులగపు సజ్జు? అదేమిటలా ఆడా మగా వివక్షత లేకుండా అతగాడి పైబడి మాట్లాడ్తుంది? ఇదెక్కడి దిక్కుమాలిన స్నేహితులే బాబూ కొంపమీదికి కూడా తెచ్చిపెట్టాడు?" అని వినుక్కుంటూన్న తల్లి దెస నిస్సహాయంగా చూడటం మినహా ఏమీ చేయలేకపోయింది కాంచన.

"అనితా! బాత్ రూమ్ అదీ, అనితా పడుకుంటావా, అనితా అన్నం తింటావా?" అంటూ అనిత కూడాకూడా మరీ నౌఖరులా తిరుగుతూ, "ఇహిహీ, ఇంట్లో మరెవరూ లేరుకదూ పాపం, ఏం కావాలో కనుక్కోటానికి? ఆవిడకేమో మన భాష రాదాయె!" అంటూ భార్యతో ఓ వెకిలినవ్వు నవ్వుతూవున్నాడు గోపాల్.

అలాగే మౌనంగా గరళపానం చేస్తూన్నది కాంచన.

సాయంత్రానికి యింటికి వచ్చిన కేశవ్‌తో తల్లి అన్నది, "నీ బావ ఎవరో తెల్లదొరసానినీ, దాని మొగుణ్ణి

తీసుకొచ్చాడు చూడు. ఒకటే విరగబాటూ, వికవికలూ. నాకేం నచ్చలేదీ వరస."

"ఏమిటి కాంచనా, అమ్మ ఏమిటో అంటోంది ?" చెల్లెలి గదిలోనికి వెళ్ళి అడిగాడు కేశవ్.

"ఏమంటోంది ?" ఏమీ ఎరగనట్లే అడిగింది కాంచన గబగబ కళ్ళు తుడుచుకుని.

అది గమనించకపోలేదు కేశవ్. "బావ స్నేహితు లెవరో వచ్చారా!" అనడిగాడు మళ్ళీ.

"ఔను, మేడమీది గదిలో వున్నారు" అన్నది ముక్తసరిగా.

ఇంగ్లీషురాని కాంచనవద్దలాగా స్వేచ్ఛగా మాట్లాడ డానికి లేక చాలా తూచితూచి మాట్లాడారు గోపాల్, అనితా, వినోద్ కూడ.

"అనితా! మనదేశపు పేరు!" అన్నాడు కేశవ్ ఆశ్చర్యం ప్రకటిస్తూ.

"అదే పెళ్ళి తర్వాత మనవాడు అలామార్చేడు. అసలుపేరు ఏనీ!" వివరించాడు గోపాల్. "ఈమె తండ్రి పంజాబీ. అయితే అతడు లండన్‌లో స్థిరపడిపోయి అక్కడి స్త్రీనే వివాహం చేసుకున్నాడు. ఈ విధంగా ఈమె

హిందువే. మన పద్ధతులవీ కొంచెం కొంచెం తెల్సు. ఇప్పుడు మొదటిసారి ఇండియాకి వచ్చింది"

"ఓహో! అయితే మీరంతా అక్కడి స్నేహితులన్న మాట?"

"ఆ. వీక్ఎండ్స్‌లో హిందూ కుటుంబాలందరమూ ఎక్కడో ఓ చోట కల్సుకోవటం,మన పండగలు కలిసి జరుపుకోవటం— అలా గడుపుతూండే వాళ్ళం."

వినోద్ అవకాశం కోసమే ఎదురు చూస్తున్నట్లుగా, "గోపాల్, నీ అంత తెలివైన వాడు ఎందుకు ఈ ఇండియాలో పడివుండడం? వచ్చేసెయ్యి మళ్ళీ. హాయిగా ఎంత సుఖం అక్కడి జీవితం!" అన్నాడు.

"ఔను, నేనూ అదే ఆలోచిస్తున్నాను. అయితే కాంచననూ మామగారినీ కూడా సంప్రదించాలిగా? కాంచన ఒక్కతే ఆడపిల్ల కావటంతో వదిలివుండలేరు వాళ్ళు."

వింటూన్న కేశవ్ ఆశ్చర్యపోయాడు.గోపాల్‌కు ఇంత ఆలోచనా అతి తెలివీ ఎలా వచ్చాయా అని. అతడు మరలా ఏదో పథకంలో వున్నాడని గ్రహించి త్వరత్వరగా నిష్క్రమి

మించాడక్కడినుంచి. 'ఇడియట్ పారిపోతున్నాడు!' అనుకు న్నాడు గోపాల్ కసిగా.

"చూడు కాంచనా నాల్గురోజులుండిపోయే వాళ్ళ కోసం నీవు బుర్ర పాడుచేసుకోనక్కరలేదు. వాళ్ళు విదేశీయులు. సరే, ఇతడు కాస్త అల్ట్రామోడరన్. పోనీయ్. నేను మాట్లాడి వచ్చాను. ఏమంత విడ్డూరం అన్పించలేదు మరి" అన్నాడు.

గుట్టుగా సంసారం సాగించవలసిన చెల్లెలితో అంత కంటె ఏ అన్నమాత్రం ఏమి చెప్తాడు?

# 10

బాహ్యప్రపంచాన్నే మరచినిశ్శబ్దంగాకన్నీరుమున్నీ రుగా విలపిస్తూన్న కాంచన, గోపాల్ హేళనా పూర్వకమైన పలకరింపుకు జాగ్రదావస్థకు వచ్చి ఖంగారుపడ్తూ లేచింది.

"ఆహా! ఏమి పతివ్రతలు ఈ భారతదేశంలో! కట్టు కున్న నిర్భాగ్యుడు కళ్ళెదుట నిలబడ్డా సరకుజేయక, ప్రియుడి ప్రేమ సందేశాలను ప్రేమ పత్రాలనూ చదువు కుంటూ ఆనందబాష్పాలు రాల్చుతారు. వ్హారెవ్వా! ఎంత నిర్భాగ్యుడవురా గోపాల్. ఈ దేశంలో పుట్టావు నువ్వు!" తనపై తానే సానుభూతి కురిపించుకున్నాడు, కాంచన చేతి లోని లేఖను తీసుకుని చదువుతూ.

అది మాధవ్ రాసిన ఉత్తరం.

"చవట! వయసొచ్చిన పిల్ల ఈ వాజమ్మకోసమే ఎదురుతెన్నులు చూస్తుంటుందని అనుకున్నాడు శాబోలు.

ఈ వాజమ్మకసలు ఉద్యోగమిచ్చిన దేవడంట. ఫూల్! అందరూ వాడిని చచ్చినాళ్ళలో జమకట్టారని తెలియదూ?"

ఇక సహించలేని కాంచన "ఎందుకంతంత విషతుల్యమైన మాటలు మాట్లాడ్తారు?" అన్నది క్రోధంగా.

లిప్తపాటు ఆశ్చర్యచకితుడైనట్టు చూచాడు గోపాల్. "ఓ! ప్రియుడిపై ప్రేమయింకా నశించలేదన్నమాట! వెనకేసుకొస్తున్నావ్!"

"నీచంగా మాట్లాడకండి. దేనికైనా ఓ హద్దువుంది. ఇటువంటి మాటలే నేను అనిత విషయంలో మాట్లాడ్తే మీరు సహిస్తారా. కట్టుకున్న భార్యను యింత నీచంగా మాట్లాడటం మీకే అవమానమని తెలియదూ!"

"కట్టిపెట్టు ఉపన్యాసాలు! పరాయివెధవ ఉత్తరాన్ని చేతిలో పెట్టుకు కులుకుతున్నావ్!" ఉత్తరం పరపరా చింపి పారేశాడు. గిలగిలలాడింది కాంచన ప్రాణం. అందులో మాధవ్ అడ్రసు వున్నది. తిరిగి అతడికి ఉత్తరం వ్రాయడమెలా? అందుకే ఆమె ఉత్తరం తిరిగి మాధవ్‌కు చేరకుండేట్లుగానే గోపాల్ ముందుదృష్టితో ఉత్తరం చించివేశాడు.

"సాయంత్రం సినిమా ప్రోగ్రాం వేశాం. త్వరగా తయారుకా." అన్నాడు అధికారంగా.

"నాకు ఓపికలేదు. నేను రాలేను." అన్నది.

"నాకు తెల్సు, ఎందుకు రాలేవో! వాడిని తల్చుకు మురిసిపోవాలి కాబోలు ఏకాంతంలో."

"ఛీ, నీచంగా మాట్లాడటంలో మీకు మీరేసాటి! భార్యపైన అధికారం చేయడమేకాని భార్య మనస్సుతో, ఆమె బాధలతో మీకు నిమిత్తం లేదు."

"ఆహాహా! ఎంత గొప్ప డైలాగులు వాడుతున్నావ్! భార్య? ఎటువంటి భార్య? కావలసినవాడు అయిపులేక, ఎవడో ఒకడికి భార్యగా వుండాలి గనుక నన్ను కట్టుకున్న భార్య! ఈనాడు వాడు బ్రతికున్నాడని తెలిసి కట్టుకున్న వాడి కనీస కోరిక...సినిమా చూడాలనే కోరిక కూడా కాదని కాలదన్నుతున్న భార్య! నేనెంత అదృష్టవంతుడను."

శుద్ధిలేని హద్దులేని ఆ వాగుడు యింకా ఎటువంటి రూపాంతరాలు సంతరించుకుంటుందోననే భయంతో "చిత్రవధ చేయొద్దు. నడవండి, వస్తున్నాను" అన్నది. విజయగర్వంతో నవ్వుకున్నాడు గోపాల్.

మేడమీాది గదిలోవున్న బీర్వానుండి తన నగలు తీసు కోవటానికి వెళ్ళిన కాంచన ఒక్కసారి విషజంతువును చూచినట్టుగా భ్రమాన్పడిపోయి తిరిగి తలుపులు దగ్గరగా లాగి వచ్చేసింది. అసహ్యం, క్రోధం, దుఃఖం వెల్లువగా ఉప్పొంగగా ఎవరో తరుముకు వస్తూన్నట్లుగా వేగంగావచ్చి తన గదిలో పడ్డింది. ఆమెనలా తరిమివేసిన దృశ్యం! అక్కడ గదిలో వినోద్ అనిత పట్టుచీర అంచులను అందంగా సర్దుతున్నాడు గోపాల్. "మనదేశపు చీరలంటే మోజుపడ్తోంది!" అంటూ అంతకుముందురోజే బజారునుంచి మూడేసివందలు చేసే పట్టు చీరలు రెండు తెచ్చాడు. వాటిలో ఒకటి నేడు ధరింపజేసి అంచులూ, చెఱగులూ తీర్చిదిద్దుతున్నాడు. ఆమె తన సంతోషాన్ని కృతజ్ఞతనూ విపరీత చేష్టలతో వ్యక్తీకరించుతోంది.

ఈ దృశ్యం చూచి పారిపోయిన కాంచన మన స్సంతా అగ్నిపర్వతమైపోయింది. ఆమె కన్నీటితో తలగడ తడిసిపోయింది.

ఓ అరగంట తర్వాత అక్కడకు వచ్చిన గోపాల్ ముఖం కోపంతో చిరచిరలాడ్తోంది. "తయారయ్యావా ? అన్నాడు చిరాగ్గా.

"ఎందుకు ?" రోషంగా తలెత్తింది కాంచన. "మీా

ఇద్దరి మధ్య అడ్డుగా వుండటానికా? నిజంగా నేను రావాలని ఉన్నదా మీకు?"

"యూ, సిల్లీ" ప్రక్కలో కూర్చుంటూ, లేని ఓర్పును తెచ్చుకుని మాట్లాడబోయాడు. అంతకుముందు దృశ్యం ఆమె చూచినదని అతడికి తెల్సు. "నీకు లక్షసార్లు చెప్పాను వాళ్ళకు మనలా పట్టింపులుండవనీ, మేం మంచి స్నేహితులమనీ."

కోపం వర్షిస్తూ అడిగింది. "ఏమన్నావ్? మంచి స్నేహితులా? నీకు స్నేహం అంటే ఏమిటో కూడా తెలుసా? పవిత్రమైన స్నేహానికీ ప్రేమకూ కళంకం ఆపాదించి గంటక్రితమే ఎటువంటి మాట అన్నావ్ నన్నూ బావనూ? అది నాలుకేనా? ఎంత ప్రేమించినా అంతటి చనువు ఎన్నడూ తీసుకోలేదే నా బావ?"

"అందుకే అసమర్థుడన్నాను వాడిని." తేలికగా అనేశాడు. నిర్లక్ష్యంగా నవ్వుతూ "అయినా నీ కెన్నిసార్లు చెప్పాను ఇతరుల గదిలోకొచ్చేముందు తలుపుకొట్టి రావాలని?" అతడి ఓర్పు ఎగిరిపోయి, క్రోధం ఆవహించింది.

"ఏం ఎందుకు? మీకేమైనా భార్యాభర్తలా మీ గదిలోకి వచ్చేముందు హెచ్చరించి రావటానికి?" మనసు

ఉడికిపోతూన్న కాంచన మౌనం వహించలేక పోతున్నది. కోపమంతా వెళ్ళగ్రక్కితేకాని ఆమె హృదయం బ్రద్దలై పోయేట్లుంది. "కట్టుకున్న భార్యనై ఏనాడూ అంతటిసరసతకూ మురిపానికీ నోచుకోలేకపోయాను. నీలో అటువంటి సామరస్యమే లేదని సరిపెట్టుకున్నాను. ఈనాడు ఎవతెతోనో కులకడం కళ్ళారా చూచి అది స్నేహమని నమ్మగలనా ? అంతటి అమాయకురాలనా ?" అంతకంతకు తారస్థాయిని అందుకుంటూన్నది ఆమె కంఠం.

"నోరు మూస్తావా ?" అసహనంగా అరిచాడు.

"మూసుకోవలసింది నేను కాదు, నేను సిగ్గూశరం హద్దూపద్దూ లేకుండా గాని ప్రవర్తించటం లేదు. నా ఇంట్లో, నా కళ్ళెదుట యిటువంటి దరిద్రమంతా చూసి నేను భరించలేను."

"ఓ నీ యిల్లా ? బాగానే బుద్ధిచెప్పావులే. ఔను నా కళ్ళతో నేను నీ విహారాలూ, ప్రేమకలాపాలూ ఎన్నో చూచినా, నిన్ను పెళ్లిచేసుకున్న వెధవనికదూ ? అందువల్ల యింత నీచంగా మాట్లాడుతున్నావ్ కదూ ?"

ఇద్దరూ ఘర్షణపడ్తూన్నట్లు గ్రహించిన తల్లి వచ్చి కాంచనను బలవంతంగా బయటకుతీసుకుపోయింది. "ఎందుకే తల్లీ ? కడుపు చించుకుంటే కాళ్ళమీద పడ్తుందనీ..."

"ఏం జరుగుతున్నదో ఏమిటో నీకు తెలియదమ్మా" కాంచన వెక్కిళ్ళతో అన్నది.

"తెలుసే తల్లీ తెలుసు. తెలిసి మాత్రం చేయగలిగేది కంఠశోషే! కాని కట్టుకున్న వాడిని కాదనగలమా చెప్పు? ఇంకెందుకు అనవసరపు గొడవ?"

"అందుకనీ కళ్ళున్న కబోదిలాగా ప్రవర్తించమంటావా?" రోషంగా అడిగింది.

"అంతే మరి. ఏం చేస్తాం బరితెగించినవాడితో, మాటలే మిగుల్తాయి. కానీ ప్రయోజన మేమిటి? డాక్టరు—విదేశాలకెళ్ళి వచ్చినాడు—ఎంత గొప్పవాడోనని మురిశాం. మురిపం ఎంతలో ముక్కలుచేశాడే తల్లీ భగవంతుడు." తల్లీ కూతురూ కౌగలించుకుని ఏడ్చారు.

గోపాల్ ఏమనుకొన్నాడో' యేమో- అనితను ఆ మర్నాడే పంపేశాడు. కాంచనను కసురుకోవటం కూడా తగ్గించాడు.

కానీ అతడి లీలలు కర్ణాకర్ణిగ తెలుస్తూనే ఉన్నాయి. కొంచెం అలుసిచ్చిన నర్సులతో చాల విపరీతంగా ప్రవర్తిస్తాడనీ, ఎవరెవరితోనో కలసి హోటళ్లలో పిక్నిక్ లూ, పార్టీలూ అని రాత్రింబవళ్ళు సీసాలూ, స్త్రీలతో గడుపు

తున్నాడనీ — ఎంత వినకూడదనుకున్నా ఎవరో ఒకరు తెలియచెప్తారు యిటువంటి శుభవార్తలు.

శిలలాగా కాంచన ఏమి విన్నా చలించకుండా ఉంటున్నదిప్పుడు నిత్యం గంభీరంగా ఉంటుంది. అవసరమైతే తప్ప ఎవ్వరితోనూ మాట్లాడదు. ఆమె మనసు ఏమిటో ఆమెకే తెలియాలి.

కోరుకున్న కోవెలలో అడుగిడలేకున్నా, ఆశించిన పెన్నిధి లభింపకపోయినా మనస్సును సంపెట్టుకు జీవించుదామనుకొన్నది. ఏమీ కోరకపోయినా ఎదురు పీడించేభర్తతో పూర్తిగా మనశ్శాంతి కరువైనదామెకు.

# 11

"ఎంత మూర్ఖుణ్ని నేను! కాంచన నా ఉత్తరం చూచుకొని ఎంత నవ్వుకుంటుందో కదా! ఎలా మర్చిపోయావు కాంచనా నన్ను? ఎందుకు చేసుకున్నావ్ పెళ్ళి? యుగయుగాలకూ వేచియుంటానన్నావు. జన్మ జన్మలకు మనమిద్దరమే ఒకరికొకరం అన్నావ్. ఇంతలోనే నన్నెలా విస్మరించావ్? పెద్దలు ఒత్తిడిచేశారా? నాపై కోపం వచ్చిందా?"

నిత్యం యిదే చింత మాధవ్‌కు. బాధ నిలువునా కృంగదీయసాగిం దతడిని. ఏ పనిపైనా మనసు నిలవదు. జీవితంపైనే శ్రద్ధా మమతా నశించాయి. తల్లిదండ్రులను తలచుకున్నపుడెల్లా విపరీతమైన ఏహ్యభావం కలుగుతున్న దతడికి. "ఆ రోజున తల్లీ తండ్రీ అలా అవమానించకపోతే తానంత విరక్తితో యిల్లూ ఊరూ వదలి వచ్చేవాడు కాదు. తానక్కడ ఉంటే కాంచన పరాయిదైపోయే అవకాశమే

లేదు. ఇద్దరూ కలసి లోకాన్ని ఎదిరించేవారు. ఛీ! ప్రేమ భావమే తెలియని ప్రేమ బాధే తెలియనివాళ్ళు యిన్నేళ్ళు సంసారాలు చేసి యింతమంది సంతానానికి జన్మ నెలా యిస్తారు? నా ప్రేమతో నా బాధతో నా మనసుతో నిమిత్తం లేని ఈ పాషాణాలను నే నెందుకు ప్రేమించాలి? ఎందుకు గౌరవించాలి? ఛీ! నా కెవరూ లేరు. నే నెవరికీ లేను.

ఆరోజు కారోజు మాధవ్ హృదయఘోష సముద్ర ఘోషవలె విస్తరించసాగింది.

"పోనీలే నువ్వైనా కళకళలాడుతూ చల్లగావుండు కాంచనా." అని కోరుకుంటూ ఆశీర్వదిస్తాడు, కానీ...కానీ ఆమె చల్లగా, చక్కగా ఎలాగుంటుంది? తనను మించిన హృదయవేదనఅనుభవిస్తూండివుంటుంది."అయ్యో కాంచనా! గోపాల్ వంటి చపలచిత్తునితో జీవితం ఎలాగడుపుతావ్? అతడు నీచుడు. పరమనీచుడు. నాకు తెలుసు." అని వగస్తూ తల పోస్తాడు మరికొంత తడవు.

హృదయ శరీర శల్యాలను ఏకమొత్తంగా దహించి వేసే ఈ భయంకర బాధను మరిపింపజేసేది అటు ఫ్యాక్టరీలో పని-ఇటు రత్న చెప్పే అమాయకమైన మాటలు.

ఏదో ఓ పని కల్పించుకుంటూ ఎంతో సమయం ఫ్యాక్టరీలోనే గడిపేస్తాడు. "మరీ అంత శ్రమపడకు మాధవ్. కొంతైనా రెస్టువుండాలి." అని జనార్దనరావు హెచ్చరిస్తూంటాడు. ఒక్కోప్పుడు బలవంతాన తనతో తీసుకు వచ్చేస్తాడు.

"మీరు చెప్పండీ చదువు నాకు... మీరు నన్ను బజారుకు తీసుకువెళ్ళరూ?" ఇలా ఏదో ఒకటి మాధవ్‌నే కోరుతుంది రత్న. ఆ అమ్మాయికి తనపై అంతగురి ఎలా కుదిరిందో కూడా ఆశ్చర్యంగా వుంటుంది మాధవ్‌కు. తను దహించుకుపోతూన్న బాధను మఱచిపోవటానికి "సరే" నంటూ రత్నకు చదువు చెప్తాడు. విసిగించకుండా నేర్చుకుంటుంది అతడి దగ్గర. మాధవ్‌పై మంచి అభిప్రాయంగల జనార్దరావుకూడా రత్న కనీసం మాధవ్ వల్లనైనా సరియైన దారిలో పడ్తూన్నదని సంతోషిస్తున్నాడు.

# 12

"ఎవరో అనామకుడిని తెచ్చి జనార్ధనరావుగారు ఫ్యాక్టరి అజమాయిషీ అంతా మెల్ల మెల్లగా హస్తగతం చేస్తున్నారట!" ఉద్యోగులనుండి నౌఖర్లవరకూ అందరికీ ఈ ఆశ్చర్యకరమైన సంగతే. ప్రపంచంలోని ఏడు అద్భుతాలకంటె అద్భుతకరమైనదిగా విపరీతంగా విస్ఫూరంగా కన్పట్టి, చర్చనీయాంశమైనది.

"వీడెవడో నిన్నగాక మొన్న పాసైన కుర్ర యింజనీరు! మననేం అజమాయిషీ చేస్తాడు?" కొమ్ములు తిరిగిన పెద్ద యింజనీర్లు బీరాలు పలుకసాగారు.

"అయినా జనార్ధనరావుకి మనమీద నమ్మకం ఎందుకు పోయిందో, "మనపైన" అంటూ మరొకడిని తేవటానికి? ముసలితనంలో మతి వక్రించింది కాబోలు!"

"అసలూ...మన ఫ్యాక్టరీ ఏమీ "వాంటెడ్ కాలమ్స్"లో అడ్వర్టైజ్ చేయలేదే యింజనీరు పోస్టు

ఖాళీగావుందనీ. మరి వీడెవడూ? ఎలావచ్చాడు ? ఏ ఇంట ర్వ్యూలూ అంచాలూ లేనిదే ఉద్యోగమేమిటి ఇటువంటి పెద్దఫరమ్స్‌లో?"

"కుర్రాడు చాకులా వున్నాడోయ్ ! పిచ్చిదాని కోసం ఏమైనా పథకాలు వేస్తున్నాడేమో ముసలాడు !"

ఇటువంటి వ్యాఖ్యానాలు పరిపాటి అయిపోయాయి జనార్ధనరావు పరోక్షంలో ఉద్యోగు లందరికీ.

ఒకసీటు, ఒక ఉద్యోగం అనిలేదు; ఫ్యాక్టరీ అంతా తిరుగుతూ ఎక్కడేం జరుగుతుందో చూస్తూంటాడు మాధవ్. అతడువచ్చి తమకు సలహాలివ్వటం, ఒకొక్కప్పుడు తాము చేస్తూన్న పని తప్పని నిరూపించటం సీనియర్ ఉద్యోగులెవరికీ ఇష్టంగా వుండడంలేదు. మాధవ్ వస్తున్నాడంటే అసూయగా ఉడికిపోతూ చూస్తూంటారు అందరూ. మాధవ్ చెప్పినది వేదవాక్యంగా వుంటోంది జనార్ధన రావుకు. కార్ల విషయం బాగా తెలిసినవాడూ, విపరీతమైన తెలివిగలవాడూ అని అతడికి బాగా నమ్మకం ఏర్పడింది.

"మాధవ్! ఆ రికార్డ్సు చేశావా? ఆ అర్జంట్ ఫైల్స్ చూశావా? ఈ రిపోర్ట్సు చూశావా?" అంటూ జనార్ధన

రావు అడుగడుగునా మాధవ్ సలహాసుకోరడం అందరికీ విడ్డూరంగానే వుంది.

"వాడిలో అంత తెలివి ఈయన ఏమిచూశాడబ్బా?" "మాధవా మాధవా" అంటూ దేవుడిని కొలిచినట్టే కొలుస్తున్నాడు అని చెవులు కొరుక్కునే వారిలో చనువున్న ఒకరిద్దరు జనార్దనరావునే సూటిగా అడిగేశారు.

లోతుగుండెగల జనార్దనరావునుండి ఒక్క చిరునవ్వే సమాధానమైంది. "అతడిలో ఏమి తెలివి చూశాడో ఎంతటి బుద్ధీ వినయాలున్నాయో తనకే తెల్సు. ఇతరులకు చెప్ప నవసరంలేదు. కాని ఏమి అనుబంధమున్నదో తనకే తెలి యడంలేదు. ఇదేదో జన్మజన్మల అనుబంధంలాగా అన్పి స్తుంది. ఎందుకో అతడినిచూస్తే ప్రేమానురాగాలు పెల్లు బుకుతాయి. అదియితరులకు కన్నెర్రగావుంటే తానేం చేయ గలడు?"

ఫ్యాక్టరీ ఉద్యోగులందరికీ మాధవ్ అయిష్టంగా కంటకంగావున్నాడని అతడూ గ్రహించాడు. అయితే వారి అయిష్టతకు కారణం మాధవ్ అతితెలివితేటలూ చురుకు దనమే అయితే అందుకు తాను చేయగలిగిందేమీ లేదు. ముఖ్యంగా యిటీవల జరిగిన సంఘటన ఒకటి అటు మాధ వ్‌నూ ఇటు జనార్దనరావునూకూడ కలవరపరచుతూన్నది.

ఒకనాడు ఒక ఇంజనీరు పని సూపర్‌వైజ్ చేస్తూన్న సందర్భంలో ఒక వెల్డర్‌పై కోపం తెచ్చుకున్నాడు. కారణం—తన పనిలో నిమగ్నమైపోయివున్న ఆ వెల్డర్ ఈ ఘనత వహించిన ఇంజనీరుగారికి నమస్కారం చేయలేదు.

"ఏమిరా? కళ్ళు నెత్తికొచ్చాయి! ఇంత నిర్లక్ష్యమా మేమంటే?" అని హుంకరించాడు ఇంజనీర్.

అనుకోని ఈ గాలివానకు మొదట నిర్ఘాంతపోయినా వెల్డరు తీసిపోని సమాధాన మిచ్చాడు. "ఒరే గిరే అన బోకు. నేనేం నీ స్వంత నౌఖర్నిగాని కాను. గౌరవం యిచ్చి పుచ్చుకో."

అందరి ఎదుటా ఇంజనీరుకు తలకొట్టేసినంత పనైంది. "నీ పొగరణుస్తాను జాగ్రత్త" అని బెదిరించి, అప్పటి కప్పుడే ఫ్యాక్టరీ ఛీఫ్ ఇన్‌చార్జికి విషయం రిపోర్టు చేశాడు.

తక్షణమే వెల్డరుకు చార్జిషీటు పంపబడింది.

అటూ యిటూ కూడ పంతాలు పట్టుదలలూ చెల రేగాయి.

వర్కర్స్‌లో ఇటువంటి అవిధేయత ప్రమాదకరంగా పరిణమిస్తుందనీ, ఇలా వదలిపెట్టకూడదనీ ఇది ఇంజనీర్లందరికీ -తన్మూలంగా అధికారులందరికీ తలవంపులనీ అధికారవర్గం భావించింది.

"పని ఎలా జరుగుతున్నదో మాటిమాటికీ ఎవరో ఒక ఇంజనీరు తణిఖీకి వస్తూనే వుంటాడు. వచ్చినప్పుడల్లా అందరికీ సలాములుకొడ్తూ కూర్చోవడం మా పని కాదు. మా వల్ల పొరపాటు జరగనేలేదు. పొరపాటు జరిగినప్పుడు మమ్మల్ని ఎవరేమనటానికి వీల్లేదు. మేము చేయని తప్పుకు మేము సంజాయిషీ యిచ్చుకోనవసరంలేదు. మీరుమిక్కిలి ఇంజనీర్లమనే గర్వంతో మీరు మమ్మల్ని ఒరేయ్ అరేయ్ అని నీచంగా పిలవటానికి వీల్లేదు. అలా పదరినందుకుగానూ ఆ యింజనీరే మాకు క్షమాపణ చెప్పుకోవాలి" అని మొండికేశారు వెల్డర్లు.

వెంటనే వాడిని పనిలోనుండి తీసివేయాలని యింజనీర్లు నిర్ణయించారు.

మాధవ్ కల్పించుకున్నాడు. "ఈ వెల్డర్ టెస్ట్లు పాసైనవాడు. పనిలో నేర్పరి. అతడు చేసిన వెల్డింగ్కు తిరుగులేదు. అంతమంచి పనివాడిని తీసివేయడం తెలివైన పనికాదు. అదీగాక అతడు నోరుమూసుకు వెళ్ళిపోతాడనే నమ్మకం ఏమిటి? నమ్మెలూ గొడవలూ మొదలుపెడితే పరిస్థితి వికటిస్తుంది కదా!"

"పటప్." చీఫ్ యిన్ఛార్జి తారామండలానికి

లేచాడు. "నువ్వు ఎవరితో మాట్లాడ్తున్నావో తెలుసా? నిన్న మొన్న వచ్చినవాడివి, హద్దులు మీారకు."

"ఇందులో హద్దులూ-అనుభవాల ప్రసక్తి లేనేలేదు. యదార్థం మీాకు వివరించాను. ఆలోచించితే నా మాట నిజమోకాదో మీాకే తెలుస్తుంది. మన చిత్తప్రకారం పని వారిని తొలగించే రోజులు కావివి."

"షటప్ షటప్." రెచ్చిపోయాడు ఇన్‌ఛార్జి "గెటౌట్. నీ సలహాలు నే నడుగలేదు." అంటూనే బెల్ కొట్టి ప్యూన్‌ని రప్పించాడు. "నా పర్మిషన్ లేనిదే అడ్డమైన బికార్లనూ ఈ గదిలో అడుగు పెట్టనీయకు." అని ఆజ్ఞాపించాడు.

కోదండం, అనసూయమ్మల ప్రచారంవల్ల నిరాధారంగావున్న మాధవ్‌ను జనార్దనరావు ఎక్కడినుండో తీసుకువచ్చినట్లు అందరికీ తెలిసిపోయింది. ఈ విషయం అలుసుగా తీసుకొని అతడి ప్రాముఖ్యతపట్ల మనసులో గల అక్కసునంతనూ యిలా మాటలరూపంలో వ్యక్తం చేశాడు. అవకాశం లభిస్తే ఫ్యాక్టరీలోని ఏ ఇంజనీరైనా మాధవ్‌ను అలాగే చిన్నబుచ్చటానికి సిద్ధంగావున్నాడు. సమయానికి జనార్దనరావు ఊళ్లో లేకపోవటంకూడా అతడికి బాగా బల

మిచ్చింది. తానే లేకుంటే ఆ ఫ్యాక్టరీ నడవదనీ, జనార్దన రావు తనపై బాగా ఆధారపడివున్నాడనీ అతడికి బాగా నమ్మకం వున్నది. ఈ స్వాభిమానంతోనే అతడు నోటికి వచ్చినట్లు వదరసాగాడు.

అతడు మాటలాడిన అవమానకరమైన మాటలను భరించి ఒక్క నిముషం అలాగే కన్నార్పకుండా చూశాడు మాధవ్. ఒకవంక ఫ్యూన్ ఏమీ చేయలేక చేతులు నలుపుకుంటూ బెదురుగా చూస్తున్నాడు. అటు ఛీఫ్ ఇంజనీర్ ఆజ్ఞ. ఇటు జనార్దనరావుకు ప్రీతిపాత్రుడైన మాధవ్.

"మిస్టర్ కుమార్!" సార్ అనే గౌరవపదం మానేసి సంభోదించాడు మాధవ్ అతడిని. "అసలు విషయం మరిచి మనం వ్యక్తిగతమైన పోట్లాటలకు దిగవద్దు బికారి అధికారీ, అధికారి బికారీ కావడానికి క్షణాలుచాలు. అది వేరే సంగతి. జనార్దనరావుగారు వచ్చినతర్వాత కాని ఆ వెల్డరు విషయం తేలదు. అంతవరకూ అతడు పనిలో వుంటాడు" అనేసి విసురుగా వెళ్ళిపోయాడు.

పళ్ళు పటపట కొరుకుతూ తల పంకించాడు కుమార్.

ఆ రాత్రి శాంతంగా నిదురించలేకపోయాడు మాధవ్.

అనవసరంగా కలుగజేసుకొన్నానా నేను? ఛీఫ్ ఇంజనీరుతో తగవుఅనేది సామాన్య విషయంకాదు. జనార్దనరావుగారి కిది చాలా ఆగ్రహకారణం కావచ్చు. ఎన్నెన్ని ఆఫీసులకు తిరిగి ఉద్యోగం లేదన్పించుకున్నాడో—ఫ్యాన్ పోస్టుకుకూడా తయారై ఎందరిచేత హేళనగా నవ్వించుకుని కాదన్పించు కున్నాడో? ఆకలి కడుపుతో మరణం తథ్యమనుకొని రోడ్ల ప్రక్కన ఎలా పడుకొని గడిపాడో నాల్గురోజులు. అన్నీ కళ్లె దుట గిర్రున తిరిగాయి మరలా అదే దరిద్రావస్థ పట్టబోతు న్నదా?

విపరీతమైన ఆలోచనలతో నిద్రపట్టక అశాంతిగా గడిపిన మాధవ్ కు ఉదయమే తయారై ఫ్యాక్టరీకి వెళ్తూంటే "ఇదే ఆఖరిరోజా!" అన్పించింది.

దానికితోడు, జనార్దనరావు యింటలేనందున అన సూయమ్మ స్వేచ్ఛారీతిని ప్రసారం చేస్తూన్న పరనిందా ప్రసారంకూడా అతడికి వ్యథాభరితమే అయింది.

అందరూ పనులలో వుండగా, సుమారు పదకొండు గంటలవేళ, గ్రామాంతరంనుండి వచ్చిన జనార్దనరావు నేరుగాఆఫీసుకేవచ్చాడనీ, తననుతక్షణంరమ్మన్నారనీ నౌఖరు చెప్పడంతో మాధవ్ గుండెలలో గుబులు ప్రవేశించింది.

"శాసీయ్. నా వల్ల తప్పేంలేదు. ఆ పైన శాసనున్నది

కాకమానదు" తనకు తానే సర్దిచెప్పుకొంటూ, ధైర్యంగానే వెళ్ళి నిలబడ్డాడు జనార్దనరావు ముందు.

అందరి వదనాలూ, ఆనందంగా ఆత్రంగా చూశాయి జనార్దనరావు దగ్గరకు వెళ్తున్న మాధవ్‌ను చూచి. ఈ దెబ్బతో అతడిపొగరు అణగిపోయిందని అందరూ భావించారు.

"కూర్చో మాధవ్." ఏదో కాగితం చూస్తూన్న జనార్దనరావు స్వరంలో క్రోధఛాయ లేమీ కన్పట్టలేదు మాధవ్‌కు.

కూర్చుని అతడు మాట్లాడబోయే విషయంకొరకు ఊపిరి బిగబట్టి వినసాగాడు మాధవ్.

జనార్దనరావు చాల సంధిగ్ధావస్థలో వున్నాడని అతడి ముఖకవళికలే విశదంచేస్తున్నాయి. ఏదో చిక్కు సమస్యలో యిరుక్కున్నట్లుం దతడి వదనం.

అంతవరకూ తదేకదీక్షతో తిలకించుతూన్న ఆ కాగితాన్ని మాధవ్ చేతిలోవుంచాడు. నిర్వికార వదనంతో అందుకుని చూశాడు మాధవ్.

తన విధులలో, తన కార్యకలాపాలలో ఎవ్వరూ ఏ విధమైన జోక్యం కలిగించుకోరాదనీ, ఆ విధంగా అంగీ

కారం కాకుంటే తన రాజనామాను అంగీకరించవలసినదనీ కుమార్ జనార్దనరావుకు సమర్పించుకొన్న పత్రం అది. మాధవ్ అధికారులను ఎదిరించుతున్నాడని, వర్కర్స్‌కు మద్దతుయిచ్చి రెచ్చగొట్టేఉద్దేశ్యంలో వున్నాడనినేరారోపణ చేయబడడమేగాక నిన్నటి సంఘటన చిలవలు పలవలతో వర్ణించబడింది అందులో.

"ఏమిటది?" జనార్దనరావు మాధవ్‌నే నిశితంగా చూస్తూ అడిగాడు.

మాధవ్ నిర్మలంగా, నిశ్చలంగా, నిర్భయంగా చూచాడు జనార్దనరావు కేసి. "బాబుగారూ, జరిగిన దేమిటో నేను చెప్పవచ్చా?"

"చెప్పమనే అడుగుతున్నాను. అయినా, ఛీఫ్‌తో ఘర్షణపడేటంత అవసరం నీకే మొచ్చింది?" జనార్దనరావు స్వరం వాడిగా లేకున్నా మాటలు పదునుగా వున్నాయి.

"అంతటి తెలివిహీనుడను కాదు బాబుగారూ."

"మరి".

"ఇందులో వ్రాయబడినవన్నీ చాలవరకూ అతిశయోక్తులు" అన్నాడు తలవంచుకొని.

చిన్నబోయిన మాధవ్ ముఖంచూచి జనార్దనరావు కొంచెం బాధపడినా పైకి వ్యక్తం కానీయలేదు.

"బాధ్యతగా, ఏ రిమార్కూలేకుండా పనిచేసే వర్కర్‌ని నిష్కారణంగా తీసివేయడం మనకే నష్టమని చెప్పాను నేను. అందుకు కుమార్‌గారే కోపం తెచ్చుకున్నారు."

జనార్దనరావు అలాగే చూస్తున్నాడు ఇంకా అతడు చెప్పబోయే విషయాలకోసం.

"బాబుగారూ! పనివాళ్ళు తమ పనిని సరిగా చేస్తున్నారా లేదా అనేది మనకు ముఖ్యం కానీ అతడు వంగి వంగి సలాములు చేయాలనేది ప్రధానంకాదు. వెల్డింగ్‌లో నిమగ్నమైపోయివున్న ఆ వెల్డర్-ఆఫీసర్ రాకను గమనించే అవకాశంకూడా లేదు. అది నిర్లక్ష్యంగా భావించి మనం అతడిని క్షమాపణలు కోరడం, తీసివేయడం జరిగితే, అది అధికారుల అహంకారంగా భావించి పనివారు స్ట్రైక్‌లూ వగైరా మొదలు పెడతారు. పని ఆగిపోతుంది. పోలీస్ బందోబస్తులూ వగైరా మనకూ చాలా ఖర్చుఔతుంది... ప్రొడక్షన్ ఆగిపోతే అది మన కెంత దెబ్బో చూడండి. ఒక వెల్డర్ మానివేస్తే మనకు తిరిగి అంత సమర్థతగలవాడు దొరకటానికి చాలాకాలం పడుతుంది. క్రొత్తవాడైతే మనం

తర్ఫీదుయిచ్చి టెస్ట్‌లు పాస్ చేయించాలి. ఇందుకు ఒకో్క వెల్డర్‌కు మనం కనీసం ఎనిమిది తొమ్మిదివేలు ఖర్చుపెట్టవలసి వుంటుంది. అందుకే అతడిని పనిలోనుండి తీసివేసేముందు అవన్నీ చాడీలుగా మీా ముందు ఉంచటం నా కిష్టంలేదు. అందుకే నేను మీాకు వివరంగా చెప్పటంలేదు...అయితే, ఛీఫ్ ఇంజనీరుతో తగవు పెట్టుకోవాలనే ఉద్దేశ్యం నా కెప్పుడూ కలుగదు. వర్కర్స్‌తో తగవులు లేనిపోని అనర్థాలకు దారితీస్తుంది. మన ప్రొడక్షన్ ఆగిపోతుంది-అనే భయంతో నేనా సలహా యిచ్చాను. అంతే. ఉత్పత్తికి ఇంజనీర్స్‌కంటె వర్కర్సే ప్రాణం బాబుగారూ."

మాధవ్ మాటలను శ్రద్ధగావింటూన్న జనార్దనరావు ఒక్కసారిగా తలెత్తి అదోకమాదిరిగా చూచాడు. ఆ చూపులో అనేకభావాలు !

అది చూచిన మాధవ్ తను ఆవేశంగా మాట్లాడుతున్నట్లు గుర్తించి సిగ్గుపడ్డాడు. తగ్గు స్వరంలో అన్నాడు తిరిగి "వాళ్ళకూ ఎన్నో కష్టాలుంటాయి. ఒకడికోసం పదిమందీ సమ్మె చేయాలి, ఇష్టమైనా లేకున్నా. సమ్మె చేయక పోతే యూనియన్ బ్రతకనీయదు. సమ్మెచేస్తే ఇంట్లో తిండానికుండదు. పెళ్ళాం పిల్లలు మలమల మాడిపోతారు. దానితో కావేషాలు యింకా పెరుగుతాయి. ఇదంతా

ఎందుకు బాబుగారూ?...ఎక్కువగా మాట్లాడివుంటే క్షమించండి.”

“మాధవ్‌ను జనార్దనరావు గదిలో బాగా చీవాట్లు వేస్తూండాలి. అందుకే యింతసేపున్నాడు. అక్కడ దెబ్బతో తిక్కకుదుర్తుంది వీడికీ ముసిలాడికికూడా” అనుకున్న అందరూ ఆశ్చర్యంతో నోరావలించారు, ఆ సాయంత్రం కుమార్ రాజీనామాను అంగీకరించిన వార్త తెలియగానే.

ఈ అనుకోని పరిణామానికి కుమార్ హతాశుడయ్యాడు. దిగ్భ్రమకూడా కలిగింది. ఫ్యాక్టరీ విషయంలో అన్నివిధాలా తనపై ఆధారపడివున్న జనార్దనరావు తననే బ్రతిమాలుతాడనీ, ఈ దెబ్బతో మాధవ్ ప్రశంసా, ప్రాముఖ్యమూ అన్నీ అడుగంటిపోతాయనీ భావించిన అతడి ఊహాలు పూర్తిగా తలక్రిందులయ్యాయి.

మాధవ్ ఇలా వర్కర్ల తరఫున వాదించి వారికి న్యాయం కూర్చడంవల్ల వారందరికీ మాధవ్‌పై ఎనలేని సద్భావం కుదిరింది. “మాధవ్ బాబు, దేవుడే.” అనుకున్నారు.

“ఫ్యాక్టరీ క్షేమాన్నీ ఉత్పత్తినీ కాంక్షించే వ్యక్తికే బాధ్యత నెత్తినపెడితే యింకా బాగా నడుస్తుంది ఫ్యాక్టరీ” అనుకున్నాడు జనార్దనరావు.

మాధవ్‌కు మాత్రం నెత్తిన ఒక పెద్దకొండను నిల బెట్టినట్లే భారంగా అన్పించింది. ఇంత గురుతరమైన బాధ్య తను తాను సక్రమంగా నిర్వర్తించగలడా?

# 13

కంపెనీని గురించిన కొన్ని ముఖ్యవిషయాలను చర్చించటానికి డైరెక్టర్ల సమావేశాలు జరుగుతున్నాయి. ఆ రోజు ఆఖరి సమావేశం, తన యింట ఏర్పాటుచేశాడు జనార్దనరావు.

చర్చల అనంతరం విందు జరుగుతూన్నది. వున్నది ఆరుగురే అయినా భారీ ఎత్తున వున్నాయి ఏర్పాట్లు. ఇటీవల ఇంటిలో ఒక సభ్యునిమాదిరిగా మెలగుతూన్న మాధవరావును కూడా తమతోనే భోజనానికికూర్చోమన్నాడుజనార్దనరావు. మాధవ్ బిడియపడ్డాడు. "మీరందరూ పెద్దలు. మీతో నేనెందుకండీ?" అన్నాడు సిగ్గుపడిపోతూ.

నవ్వేశాడు జనార్దనరావు. "మే మందరం ఒకవిధంగా పెద్దలమైతే నువ్వువిద్యలో, జ్ఞానంలో పెద్దవాడివి. రా. రా. నేను పిలుస్తున్నానుకదా" అంటూ బలవంతంగా తీసుకు పోయి టేబుల్ వద్ద తనప్రక్క కుర్చీలో కూర్చుండచేశాడు.

"ఇతడు నా ప్రాణం. నా సర్వస్వం" అంటూ వారందరికీ పరిచయం చేశాడు.

ఛలోక్తులతో, సరసంగా సాగుతూన్న విందు అంతలోనే రసాభాసపాలైంది.

ఎక్కడినుంచి వచ్చిందో రత్న సుడిగాలిలా వచ్చి "ఇవాళ నాకంటె ముందుగా అన్నం తినేస్తున్నావా డాడీ?" అంటూ బల్లపై ఎగిరి కూర్చున్నది. దానితో బల్లపై రెండు మూడు పాత్రలు బోర్లబడి అందలి పదార్థాలతో అతిథుల దుస్తులు పూర్తిగా పాడయ్యాయి. జనార్దనరావుకు మేను చచ్చిపోయింది. సిగ్గుపడిపోతున్నాడు; అతిథులు వింతగా చూడసాగారు. అందరినుండీ ముందు తేరుకుని కర్తవ్యం స్ఫురణకు వచ్చిన వ్యక్తి ఒక్క మాధవ్ మాత్రమే.

అతడు చటుక్కున లేచి, "క్షమించండి" అని అతిథు

అందరికీ విన్నవించుకుంటూ "రండి. మనం వేరే తిందాం" అంటూ రత్నను చేయిపట్టుకు బలవంతంగా తీసుకుపోయా డక్కడినుండి.

చిటికెలో అందరికీ అవగాహన అయిపోయింది రత్న మతిమాలినదని. ఇంటి నౌఖర్లకు, అతి ఆత్మీయులకూ మినహా రత్న పిచ్చిదని ఇంతవరకూ ఎవ్వరికీ తెలియనీయ కుండా జాగ్రత్తపడుతూ వస్తున్నాడు జనార్దనరావు. మధ్య స్థితి ఎలాగో సాటి పెద్ద సంబంధమే కుదిర్చి పెళ్ళి చేసేయా లని అతడి అభిలాష. వివాహానంతరం కుదిరే మతిభ్రమణాలు కూడా వుంటాయనీ, రత్న మరీ భయంకరమైన పిచ్చిది కాదనీ, మెదడూ బుద్ధీ ఎదగని లోపం అనీ. సుఖమైన సంసార జీవితంలో లోపం సవరించుకు పోగలదనీ వైద్యులు అన్నారు. కాని అలా జరుగుతుందో లేదో! ఇది బహిరంగ మైపోతే సరీ సాటి వారిలో సంబంధాలు రాకపోవడమేగాక చులకన కూడా అయిపోతాడు. చూస్తూ చూస్తూ పిచ్చి దాన్ని పెళ్ళాడే విశాల హృదయులుంటారని అతడికి నమ్మకలేదు. ఇక ఆస్తి! మహాసముద్రమంతటి ఆస్తిపాస్తు లున్నాయి రత్న వెనుక. ఆ ధనసంపద కోసం కన్నుచెదరి ఎవడో రావచ్చు. కాని అది రత్నకు సుఖకరమూ కాదు, మీదు మిక్కిలి ప్రాణహాని కూడా.

అందరూ నిష్క్రమించేవరకూ ఎలాగో నిగ్రహించు కున్న జనార్దనరావు ఏకాఏకీ కూతురి గదిలోకి వెళ్ళాడు. అక్కడ రత్న భోజనం చేస్తోంది. ఎదురుగా కూర్చుని అను నయ వాక్యాలు చెపుతున్నాడు మాధవ్. రత్నను చూస్తూనే జనార్దనరావు ఆగ్రహం అవధులు దాటిపోయింది.

"ఛీ. అన్న-సున్నం. ఇలాంటి దేభ్యం ఇంకా మెక్కి-మెక్కి బ్రతక్కపోతేనేం?" ఛీత్కరిస్తూ పట్టరాని కోపంతో రత్నను జుట్టుపట్టి కుర్చీనుండి ఇవతలికి లాగి తగిలేదీ, తప్పేదీ తెలియకుండా బాదసాగాడు జనార్దనరావు.

నిర్ఘాంతపోయిన మాధవ్ తేరుకొని అడ్డుకొనే లోపు గానే రత్నకు చాలా దెబ్బలు తగిలాయి. "కొట్టకునాన్నా, కొట్టకునాన్నా నేనేం చేశాను నాన్నా?" అమాయకంగా అడుగుతూ హృదయవిదారకంగా ఏడుస్తోంది రత్న. ఇద్దరు ముగ్గురు నౌఖర్లు ఈ గలభా విని పరుగు పరుగున వచ్చారు కాని జనార్దనరావు ఉగ్రరూపం చూచి ఎవ్వరూ దరిదాపు లకు వెళ్ళలేక దూరంగా నిలబడిపోయారు. అమ్మాయిగార్ని అపురూపంగా చూచుకోవడమేకాని కనీసం ఎప్పుడూ అద లించడం కూడా ఎరగని అయ్యగారు ఈ రోజు యిలా రౌద్రావతారం ఎత్తడం చూస్తే అందరికీ ఆశ్చర్యంగానే వున్నది.

"సార్. సార్. నా మాట వినండిసార్." ఆ దెబ్బ లలో కొన్ని తనకు కూడా తగులుతున్నప్పటికీ లెక్కజేయ కుండా, తన శక్తినంతనూ ఉపయోగించి రత్నను జనార్దన రావు చేతినుండి విడిపించగలిగాడు.

"బాబుగారూ, నా మాట వినండి. ఆవేశంలో వున్నారు మీరు" రత్నకు రక్షగా తాను అడ్డు నిలబడుతూ ఇంకా పులిలా లంఘించుతూన్న జనార్దనరావు చేతులు పట్టు కున్నాడు.

"నీకు తెలియదు. నీకు తెలియదు మాధవరావ్. నువ్వ అడ్డులే. దీనిని ఇలా వదిలేస్తే ఇదే ఆటగావుంది" రొప్పుతూ తరగని కోపంతో అన్నాడు జనార్దనరావు. అతడి తీరు చూస్తే ఈనాడు రత్నను చేజేతులా మృత్యువుకు వప్ప జెప్పి కానీ ఊరట నందేట్టు లేదు.

"బాబుగారూ, కొడితే ఆ అమాయకురాలు గ్రహిం చుకో గలుగుతుందా ? మీరే—కన్నతండ్రే యింత నిర్దయ చూపడమా ?"

"నీతులు చెప్పడం సులభమే మాధవ్ !" గర్జించాడు జనార్దనరావు. అతడెవరినీ - ఖాతరు చేసేట్లు లేడు ఆ క్రోధంలో. "దీనితో నాకెంత చావుగా ఉన్నదో,.. ఎంత

గుండెలపై మండుతూన్న పొయ్యిలా ఉన్నదో నీకేం తెల్సు ?"

"అది ఆ అమాయకురాలి తప్పుకాదు"

వింటూనే రెచ్చిపోయాడు జనార్దనరావు. "ఔను. ఆమె తప్పు కాదు; ఎవరి తప్పూ కాదు. నాదే తప్పంతా, తప్పంతా నాదేనోయ్." గుండెలు కొట్టుకుంటూ అన్నాడు. "కన్నపాపానికి నాదే తప్పంతా" అంతలోనే కోపమంతా దిగులులోనికి మారిపోయింది. నెత్తిన చేతులు వేసుకుని కుర్చీలో కూలబడ్డాడు.

మాధవరావు వెనుక నక్కిన రత్న ఇంకా వెక్కిళ్ళు పెడుతూనే వుంది.

"నేనేం చేశాను నాన్నా ? ఇలాగే కొడితే నేను పారి పోతాను" అన్నది.

మరలా క్రోధం రేకెత్తింది జనార్దనరావులో. "చూపే స్తాను జాగ్రత్త నోరెత్తావంటే పెంకెఘటమా! నీ గది దాటి బయటకు రా మరి చెప్తాను."

"బాబుగారూ, ఆవేశంగా ఉన్నారు. మీరు నడవండి మీ గదిలోకి. పాపం బెదిరిపోతోంది రత్న."

"లేదు. ఈరోజు ఇది ఫైసలా కావాలి. దీనితో నేను

చచ్చిపోతున్నాను. పెళ్ళైటూ కాదు దీనికి, భర్తే విరగడై పోతుంది."

"చంపేసేయి నాన్నా! అమ్మ దగ్గరకి పోతాను" భోరు మన్నది రత్న.

హృదయం పిండినట్లైంది మాధవ్‌కు. "తండ్రి) వుండీ మరలా గనవద్దు బాబుగారూ. ఎవరో విశాల హృదయు డెక్కడో వుంటాడు. తప్పక రత్న సుఖపడ్తుంది. అమాయ కులూ, పసివారూ భగవానునికి ప్రతిరూపాలు."

హేళనగా మాధవ్ కనులలోనికి చూస్తూ నిర్లక్ష్యంగా నవ్వాడు జనార్దనరావు. "ఎందుకొచ్చిన మాటలు మాధవ్ యివి? ఎందుకిలా మభ్యపెడతావ్ నన్ను? ఏ మంచి వంశం లోకి దీనిని కోడలిగా రానిస్తారు? ఏ అత్తగారు దీనిని ఆద రిస్తుంది? ఏ చదువున్నవాడూ, గుణమున్నవాడూ దీనిని భార్యగా ఏలుకుంటాడు? ఇన్నెందుకు? నువ్వే ఉన్నావు— ఇన్ని చెప్తున్నావు కదా. ఈ వెర్రిదాన్ని నువ్వు భార్యగా అంగీకరించగలవా?"

తన కనులలోనికి సూటిగా చూస్తూ నేరుగా అడుగు తూన్న జనార్దనరావు ప్రశ్న ఒక్కసారి మాధవ్ గుండెలను గుబగుబ లాడించింది. అనుకోని ఈ సవాలుకు అతడు ఊహిం చని పిడుగుపాటులాగా దిగ్భ్రమ చెందాడు.

వెటకారంగా నవ్వాడు జనార్దనరావు. "చూశావా? యదార్థం ఎటువంటిదో! తనవరకూ వస్తే అసలు రంగు బయటపడుతుంది. అందరూ నీతులు చెప్తారు—ఎవరో విశాల హృదయుడు వస్తాడు! ఎక్కడున్నాడు రావటానికి?"

అవి మాటలు కాదు, ఈటెలు.

జనార్దనరావు ఇంకా యింకా వెళ్ళబోసుకుంటూనే వున్నాడు తన తీరని బాధను—: "చూడు. కన్నతండ్రిని—నా రక్తంలో రక్తం —నా ప్రాణం. నాకే యింత పట్టరాని కోపం వచ్చిందే—ఇక పరాయివాడు గుండెల్లో పెట్టుకు దాచుకుంటాడా దాన్ని? నరికిపారేయడూ? అంతకంటే నేనే యింత విషమిచ్చేస్తే?" అంత కోపంలోనూ జలజలా రాలాయి అశ్రువులు.

"ఆపండి సార్, ఆపండి" ఇక వినలేనట్లుగా ఆక్రందన చేశాడు మాధవ్. ఎదలో వేయి సముద్రాల ఘోష అలజడి చేస్తుండగా, "నేను చేసుకుంటాను సార్ రత్నను—మీ క్రింద పనిచేసేవాడిననీ, బీదవాడిననీ మీకు అభ్యంతరం లేకపోతే." అన్నాడు జనార్దనరావునే చూస్తూ.

అంతకు ముందెన్నడూ చూడని అద్భుత వస్తువును దేనినో పరికించు తూన్నట్లుగా మాటలూ చేష్టలూ దక్కి గుడ్లప్పగించి చూస్తూ నిలబడిపోయాడు జనార్దనరావు.

తండ్రి కోపం చూచి బెదిరిపోయిన రత్న, తల్లి చేతిని బిడ్డపట్టుకున్నట్లుగా మాధవ్ చేతిని ఒక చేతితో గట్టిగా పట్టుకుని మరో చేతిని అతడి భుజంపై వేసి అతడికి హత్తుకుపోయి నిలబడింది. ఆమె వెచ్చని కన్నీరు అతడి షర్టును తడిపివేస్తోంది.

మాధవ్ గుండె ద్రవించి పోయింది. అసహాయ స్థితిలో తననే ఆసరాగా తననే దిక్కుగా భావించిన ఆ అమాయకురాలి చేతిని త్రోసివేయటానికి అతడి జాలి మనసు అంగీకరించలేదు. జనార్దనరావు చిత్రించి చూపుతూన్న భయంకర భవిష్యత్తులోనికి రత్నను నిర్దయగా వదలివేయటం కూడా అతడి ఉన్నత మానవత్వమూ, సంస్కార వ్యక్తిత్వమూ ఎంత మాత్రం చేయలేని పని.

"క్షమించండి బాబుగారూ, నేను అనాలోచితంగాగాని, మీ ధన సంపదపై పేరాశతో గానీ ఇలా అనటం లేదు. తన వారికే భారమై అవమానాలు పొందుతూ బ్రతక వలసి రావటం ఎంత ఘోరమో, మరెంత బాధాకరమో నాకు అనుభవ పూర్వకంగా తెల్సు. అందుకే, నేను రత్న బాధ్యతను స్వీకరించి, ఆమెను సరి జేయటానికి ప్రయత్నిస్తాను."

ఒక్కసారిగా దూకినట్లు వచ్చి... మాధవ్ రెండు చేతులూ పట్టుకున్నాడు జనార్దనరావు. ఆనందాశ్రువుల సెలయేళ్ళు జారిపోతున్నాయి అతడి చెంపలపై.

"మాధవ్.........మాధవ్." ఆవేశంలో అతడు మాట్లాడలేక పోతున్నాడు.

"దేవుడే నీ రూపంలో సాక్షాత్కరించాడు మాధవ్ నాకు. నేను పూజించే రాధామాధవుడే నేడు నా యింట అవతరించినట్లుగా వున్నది. ఇవి చేతులు కావు మాధవ్. కాళ్ళనుకో........."

"అంతంత మాటలు వద్దు బాబుగారూ. అసమర్థుడిగా అందరిచేతా చీదరించుకోబడ్తున్న నన్ను మీ రొక మనిషిని చేసి నిలబెట్టారు. మీ ఋణం జన్మ జన్మలకూ తీర్చుకోలేను. కనీసం ఈ విధంగానైనా ఉడతాభక్తిగా............"

"మాధవా ?!!" పట్టరాని సంతోషంతో మాధవ్‌ను ఆలింగనం చేసుకున్నాడు జనార్దనరావు. అతడి కృతజ్ఞత అంతా అందులోనే యిమిడి వున్నది.

"బాబుగారూ........ రత్న........బెదిరిపోయి

వుంది. మీరు........." అంటూ జ్ఞాపకం చేశాడు మాధవ్.

జనార్దనరావు కన్నీళ్ళతో రత్నను అక్కున జేర్చుకున్నాడు. "పాపిష్టి వాణ్ణి తల్లీ! ఎన్నడూ లేనిది ఎన్నెన్ని దెబ్బలు కొట్టా నివాళ !"

నిశ్శబ్దంగా నిష్క్రమించాడు మాధవ్ అక్కడి నుండి.

"ఇంకెప్పుడూ కొట్టవా నాన్నా?" అమాయకంగా అడిగింది.

"లేదు తల్లీ. లేదు. నీ పుణ్యం, నా అదృష్టం —నీకు దైవం లాంటి భర్త లభిస్తున్నాడు."

# 14

"వచ్చావా మాధవ్? ఉదయం నుండీ నీ కోసం చూస్తున్నాను. రా. రా. ఇలా కూర్చో."

"నేను మన బ్రాంచి ఆఫీసులో ఏో పని చూచుకు వస్తున్నాను సార్! అక్కడి ఫైళ్ళన్నీ చూచి వచ్చేప్పటికి ఈ ఆలస్యమై పోయింది."

"పోనిద్దూ" నిర్లక్ష్యంగా నవ్వేశాడు జనార్ధనరావు "హాయిగా పెళ్ళికొడుకువి కాబోతూ నీ కీ తాపత్రయాలన్నీ ఏమిటి? కొన్నాళ్ళు నేనేదో తంటాలు పడ్తానుకానీ...నువ్వు విపరీతంగా అలసిపోకు........ ఇదుగో చూడు, ఈ శుభ లేఖలలో నీకు ఏ మోడల్స్ నచ్చాయో చూడు. ఏ విధంగా వేయిద్దాం .........? మరి మీ నాన్నగారూ వారూ అంతా ఎక్కడున్నారో ఏమిటో ఉత్తరాలు రాయిస్తాను ......ఎన్నో పను లున్నాయి. ఎలా తెౌతాయో ఏమిటో ......" జనార్ధనరావు గడగడా మాట్లాడిన అన్నిమాటలకూ

మాధవ్ నుండి మౌనమే సమాధానమైంది. నేల చూపులు చూస్తూ ఊరుకున్నాడు.

"ఏమిటి మాధవ్? ఏమిటి?" ఖంగారుగా భయంగా అడిగాడు జనార్దనరావు. మరలా ఆతడు మనసు మార్చుకున్నాడేమోననే భయంతో "చెప్పు, ఏమిటి నీ మౌనానికి కారణం?" ఒక్క క్షణం తాత్సారంకూడా భరించలేనట్లుగా వున్న దతడి సంగతి.

"బాబుగారూ, మీరేమీ అనుకోకపోతే ఒక్క మాట చెప్దామని వున్నది" మందస్వరాన అన్నాడు.

"ఏమిటి?" భయంతో అదిరిపోతూన్న గుండెలతో క్షీణ స్వరంతో అడిగాడు జనార్దనరావు.

మెల్ల మెల్లగా చెప్పసాగాడు మాధవ్. "నాకు తల్లీ తండ్రీ తోబుట్టువులూ...... అందరూ వున్నారు బాబు గారూ. అయినా ఎవరూ లేని వాడినై మీ దగ్గర కొచ్చాను. ఎంతో విరక్తితో ఈ విశాల ప్రపంచంలో అడుగిడిన నాకు మీ ఆప్యాయతా, ఆదరణలు తిరిగి జీవితం పట్ల అనురక్తిని కలిగించాయి. నాకు మీరే దైవ సమానులు. మీ ఆశీర్వాదంతో దైవసాన్నిధ్యంలో వివాహం కానీయండి. ఆహ్వానాలూ, ఆడంబరాలూ, అందరి రాకపోకలూ, అభిప్రాయాలూ అవసరం లేదు," ......

గుండె కుదుటపడింది జనార్ధనరావుకు. "ఆదేమిటోయ్. నాకు వున్నది ఒక్కగా నొక్క బిడ్డ. ఇంక ఎవరి కోసమని కూడ బెట్టాలి? మనకేం తక్కువని నిరాడంబరంగా దేవుడి గుళ్ళో ముడిపెట్టుకోవాలి!"

మందహాసంతో జవాబిచ్చాడు మాధవ్. "అదికాదు బాబుగారూ! ఖర్చుకోసం నే నాలోచించడం లేదు. మీరు మరో విధంగా భావించవద్దు........" ఏమిటో వివరించ లేనట్టుగా మధన పడ సాగాడు.

అది గ్రహించిన జనార్ధనరావు కొంచెం ముందుకి వంగి అడిగాడు.

"చెప్పు మాధవ్. ఏమిటి నీ సంకోచం? ఏమీ ఫర్వాలేదు, చెప్పు."

ఇక తప్పనట్లుగా చెప్పాడతడు. "రత్న ఏదో ఒక చిలిపిపని చేయక మానదు. అసందర్భంగా మాట్లాడకుండా ఊరకుండదు. మీకూ కోపం వస్తుంది. అదీకాక వచ్చిన వాళ్ళు నలుగురూ నాలుగు రకాల మాటలు మాట్లాడి రత్నను అవమానించడం గానీ, చిన్న బుచ్చడం గానీ, నేను సహించలేను."

ఆశ్చర్యంగా వినసాగాడు జనార్ధనరావు.

మాధవ్ ఇంకా అన్నాడు : "ఇటువంటివారిని 'నీలో ఈ లోపం ఉన్నదీ' అని ఎత్తి చూపి అవమానకరంగా మాట్లాడటంవల్ల ఆ హీన లక్షణాలు యింకా ఎక్కువై పోతాయి. భగవత్కృపవల్ల రత్న లోపం నేను సరిదిద్దు కొన్న తర్వాతనే బంధువు అందరికీ చూపదల్చుకున్నాను. ఇటువంటి విషయాలలో సానుభూతి చూపడం అటుంచి ఎంత ఆలోచనా రహితంగా నిర్దయగా మాట్లాడతారో మీకూ బాగా తెల్సు. ముఖ్యంగా ఆడవాళ్ళు మహా ప్రవీణులు ఇటువంటి ప్రమాదకర ప్రసంగాలలో. రకరకాల వ్యాఖ్యా నాలు విని మీ రత్న బెదిరిపోతుంది."

అంగీకరించినట్లుగా, అభినందనా పూర్వకంగా అతడి భుజం తడుతూ, "నే నింతగా ఆలోచించలేదు సుమా! నువ్వన్నది అక్షరాలా నిజం అలాగే చేద్దాం. కానీ... చూడూ నా మాట కూడా నువ్వు ఒకటి వినాలి" అన్నాడు.

"చెప్పండి."

"బాబుగారూ, సార్ లు వదిలేసి లక్షణంగా 'మామ గారూ' అని పిలవ్వోయ్. 'నాన్నా' అని పిలిపించుకుంటు న్నాను రత్న చేత. నీ చేత మురిపంగా 'మామగారూ'

అన్పించుకోవాలనుంది. ఆ తర్వాత ఎటూ 'తాతగారూ' అనే వాడొస్తాడనుకో......ఏం, మాట్లాడవేం ?"

"అలాగే పిలుస్తాను మామగారూ" నమ్రతగా అన్నాడు.

"మామగారూ ! ఎంత అదృష్టవంతుడను !" పట్టరాని సంతోషంతో ఆలింగనం చేసుకున్నాడు. "ఓ రెండు నెలలు —లేదా నీ యిష్టం— ఎన్నాళ్ళయినా సరే హాయిగా ఇద్దరూ తిరిగి రండి దేశం. ఈ పనులన్నీ ఈ రోజు నుంచే నీవు మానేసేయి. తర్వాత తర్వాత ఈ తాపత్రయమంతా నీ భుజాలపై ఎటూ తప్పేది కాదు."

అన్నిటికీ మౌనంగా నిర్లిప్తంగా ఉండిపోయాడు మాధవ్.

'భగవాన్ ! నేను కలలు గన్నదేమిటి ? జరుగుతూన్నదేమిటి ?' తన గదిలో అబలవలె రోదించిన మాధవ్ దుఃఖం చూచినట్లైతే రాళ్ళు సైతం కరగక మానవు. ఒక నాడేమిా కాంచన పరాయిదై పోయినదని తెలిసిన నాటి నుండీ ఆ హృదయం అలా రోదించుతూనే ఉన్నది. నిత్యం మనసును మండించే ఈ బాధకు తోడుగా ఇప్పుడు తాను కూడా ఒక ప్రత్యేకమైన పరిధిలో, కొన్ని హద్దులలో బిగించుకు పోతున్నాడు. పర్యవసానం ఎలాగుంటుంది ? ఈ పిచ్చి పిల్ల అర్ధాంగిగా భవిష్యత్ ఏ ఏ మలుపులు తిరిగి ఏమేమి

రూపులు సంతరించుకో బోతున్నదో కదా!! తీరని ప్రేమ కంటె ఆరని జ్వాలా, మాయని బాధా ఏమున్నాయి మానవునికి ?

# 15

మాధవ్ కోరినట్లుగానే వివాహం క్లుప్తంగా జరిగిపోయింది.

డ్రైవర్ని, ఇద్దరు నౌకర్లనూ, బండెడు సామానునూ సిద్ధం చేస్తూన్న మామగార్ని మృదువుగా వారించాడు మాధవ్. "ఈ జంఝాటం, ఇతరుల ప్రమేయం ఏమీ వద్దు మామగారు. రత్నా, నేనూ అంతే— ఇంకెవ్వరూ వద్దు వెంట. అవసరమైన దుస్తులు మాత్రం తీసుకు వెళతాం. అంతే."

జనార్దనరావు చాలా అసంతృప్తి ప్రకటించాడు. "రత్న చాలా అపురూపంగా పెరిగింది మాధవ్. ఏ

మైముకు అది సక్రమంగా అమరకపోతే విసుగు పుట్టిం చేస్తుంది, జల్లిగ చేస్తుంది."

"నాకు తెలుసు మామగారూ" మందహాసంతో అన్నాడు మాధవ్. "మేము ఈ తాపత్రయా లన్నిటినుండీ దూరంగా ఏకాంతంగా గడపాలని నా ఉద్దేశ్యం. ఈ పరి సరాలూ ఈ పాత మనుషులనుండి కొంతకాలం పూర్తిగా దూరంగా ఉండాలని. మీ ఆశీర్వాదాలు మాకు పుష్క-లంగా ఉన్నాయి. భగవంతుడు నా ప్రయత్నాన్ని, మీ ఆశలనూ సఫలీకృతం కావించకలడనే అనుకుంటున్నాను."

"సరే నీ యిష్టం. నా ఆశీర్వాదం నీ కెప్పుడూ ఉంటుంది తప్పకుండా రెండ్రోజులకో ఉత్తరం వ్రాయాలి నీ అడ్రస్‌తో. అర్థం చేసుకుంటావు కదూ? రత్న నాకు... పంచ ప్రాణాలూ ...... పంచ ప్రాణాలూ మాధవా" అంటూన్న అతడి అశ్రుప్రవాహం కట్టలు త్రెంచుకున్నది.

"మీరు నిశ్చింతగా ఉండండి."

"అయితే నువ్వు రావటం లేదా నాన్నా?" కారు కదలబోతూండే రత్న అడిగింది.

"ఆయనకు కొంచెం పనుందట. తర్వాత వస్తారులే."

ఆలస్యాని కవకాశ మీయకుండా కారును బయల్దేరదీశాడు మాధవ్.

సాగిపోతూన్న కారును కంటికి కన్పించినంత వరకూ కనులు తుడుచుకుంటూ చూచాడు వృద్ధుడు.

# 16

"చూడు కాంచనా, నువ్వెప్పుడూ అలా దిగులుగా ఉండకూడదు. ఈ స్థితిలో సంతోషంగా ఉండాలి."

దొడ్లో తులసి గట్టుమీద కూర్చుని పరధ్యానంగా ఉన్న కాంచన ఈ మాటలు విని నవ్వింది కళ లేకుండా.

తల్లి మళ్ళీ చెప్పింది.

"సంతోషం కాక ఏముందమ్మా? నాకేం విచారం. ఫారిన్ రిటర్న్‌డ్ భర్త. గొప్ప సరసుడైన డాక్టర్. ఫారిన్ డాక్టరుగారి అత్తమామలని అందరూ చెప్పుకొంటే నే మీ జన్మ తరించిపోతుంది కదా!"

"అదుగో. మాటకుముందు అలా చెప్తావ్. నువ్వు సుఖపడ్డావనేగా అంత కట్నం పోసి చేశాం...అయినా పూజకొద్దీ పురుషు డన్నారు. ఇప్పుడు మాత్రం నీకొచ్చిన లోటేమిటి చెప్పు? మగవాడు మడిగట్టుకూర్చుండటం ఎక్కడో కాని ఉండదు. అందరూ అంతే."

"సరేలే మంచిది. కాస్సేపు నన్నొకతెనూ వదిలేయి." విసుక్కుంది కాంచన.

ఇలా సగం చచ్చినట్టు సరిపెట్టుకునే స్త్రీలున్న ఈ దేశంలో పురుషులకు విచ్చలవిడితనం కాక ఏమిటి ?" అప్పటికి ఇరవైరోజులై గోపాల్ శలవ్ తీసుకొని వెళ్లాడు- తలిదండ్రులను చూడాలి. ఇంటివద్ద ఏదో పని ఉన్నదనే నెపంతో. వెళ్ళాక ఒక్క ఉత్తరమైనాలేదు. అతీగతీ అసలే తెలియదు. తండ్రి కొడుకుకు హాస్పిటల్ అడ్రస్‌కు వ్రాసిన ఉత్తరాలు రెండు మరొక డాక్టర్ తెచ్చి ఇచ్చాడు "వారం రోజులనుండీ అక్కడే పడిఉన్నాయి" అంటూ.

ఇంటిల్లపాదీ ఆశ్చర్యం వెలిబుచ్చారు. గోపాల్ తండ్రిని కలుసుకుంటానని చెప్పి వెళ్ళాడే—మరి ఆ తండ్రి ఉత్తరాలు ఇక్కడికి కొస్తున్నాయంటే ఇతడేమయిపోయినట్టు? అనుమానంతో ఆ కవర్లు తెరిచి ఉత్తరాలు చదివింది కాంచన. కొడుకు ఇక్కడే ఉన్నాడనే ఉద్దేశ్యంతో ఆ తండ్రి తన

డబ్బు అవసరాలూ వగైరా వగైరా గోలంతా వ్రాశాడు అందులో. అయితే అందులో "నీ విదేశప్రయాణం ఎప్పుడు? వెళ్ళేముందు ఇక్కడ అప్పులన్నీ తీరే ఏర్పాటు చేసి వెళ్ళు. లేకపోతే నేను చాలా ఇబ్బందులలో పడిపోతాను. ఈ ఇల్లు అప్పులవాళ్ళపాలైపోతుంది." అని వ్రాశాడతడు అందులో.

"గోపాల్ విదేశాలకు వెళ్ళబోతున్నాడా? ఈ విషయం ఇక్కడ చెంతనున్న భార్యకంటె ఎక్కడోవున్న తండ్రికి తెలిసిందా? డబ్బుఏర్పాటు ఎలా చేయమంటున్నాడు? మరలా అత్తమామలను పీడించి వసూలుచేయమనా? ఇంతకీ గోపాల్ రహస్యంగా ఎక్కడికి వెళ్ళినట్టు?" అన్నీ ప్రశ్నలే. మెదడుకు పిచ్చెక్కించే ప్రశ్నలు. నరాలను బ్రద్దలుచేసే సమస్యలు.

కేశవ్ హాస్పిటల్‌కు వెళ్ళి ఆరాతీయగా చాలా విశేషాలుబయటపడ్డాయి. గోపాల్‌కు ఇద్దరు ముగ్గురునర్సులతో సంబంధముంది. అతడు ప్రస్తుతం ఒక నర్సును వెంటబెట్టుకొని వినోద విహారార్థం కాశ్మీర్ పోయినట్లు చాలామందికి తెల్సు. గోపాల్‌పై చాల ఎంక్వైరీలుకూడా వున్నాయి. ప్రస్తుతం ఒక్కడే విదేశాలకు వెళ్తాన్నట్టూ, తర్వాత తర్వాతభార్యను కూడా తీసుకు వెళ్తానని అతడు చాలమందికి చెప్తున్నాడు.

ఈ వివరాలన్నీ విన్న నారాయణమూర్తి ఆకసాని

కెగసిపడ్డాడు. "ఈసారి ఏమైతే కానియ్. బ్రాహ్మణుడికి ఒక్క పైసా విదిల్చేదిలేదు. పోనియ్.ప గంగలోనైనా దూకనీ, వీడి ముండలకీ, వీడిబాబు అప్పులు తీర్చటానికి ఇక్కడ ఎవ డబ్బసొమ్మూ తేరగాలేదు"

కాంచన నిరిస్తంగా ఉండిపోయింది.

"నీకసలేమీ తెలియదా ఈ విషయం?" కేశవ్ అడిగాడు చెల్లెల్ని.

కంయిమన్నది కాంచన "స్నేహితుడు, స్నేహితు డంటూ తిరిగేవాడివి; నీ కెందుకు తెలియవు ఈ లీలలన్నీ? ఈనాడు నన్నడిగతే నాకేం తెలుస్తాయి. యింట పడుండే దానికీ, అధికారాల అడుగున బ్రతకవలసిన దానికీ!" నిస్స హాయక్రోధంతో వుడికిపోతూన్న ఆమె కోపం ఎవరిపై ప్రదర్శించాలో తెలియక అంతరాంతరాలలో నిర్వచన దూర మైన బాధతో నుసినుసి అయిపోతూన్నది. "భర్త పరిష్వం గంలో మరొక స్త్రీ!" ఊహించుకొన్నకొలదీ మానసిక వ్యధ విస్తృతమై "నాకు చావైనా ఎందుకురాదు?" అని విలపించుతున్నదా అబల హృదయం. "మృత్యువును కోరు కొంటున్న ఈ నిర్భాగ్యజీవితానికి సంతానంకూడా ఎందుకు? ఇటువంటి నికృష్టజీవుల కడుపున పుట్టినపిల్లల బ్రతుకులెంత దుర్భరం?" కన్నీటికడలి అయిన ఆమె మనసు నిత్యం గర్భస్థ

శిశువును తలచుకొని విపరీతవేదన ననుభవిస్తుంది. "మాతృత్వాన్ని పొందబోతూన్న నేను అందరు స్త్రీలవలె మురిసి పోవటానికీ కలలు కనటానికీ లేదు. ఛీ! నాదీ ఒక జన్మేనా?"

నిత్యపోరాటనకరమైన జీవితం, ఆరాటంగా గడిచే ఘడియలూ, రోజులూ, ఆ రోజు... ఆ రోజు మొదటిసారిగా భార్యగర్భవతి అని తెలిసినరోజు...గోపాల్ ఎంత హీనంగా మాట్లాడాడో యింకా మరచిపోలేదు కాంచన. ఆ మాటలు ఆమె గుండెనుపట్టిఉన్నాయి. రాత్రి పదకొండు గంటలకు వచ్చాడు.

"ఏమిటలా పడుకున్నావ్ ?" అన్నాడు అసహనంగా భార్యనుచూస్తూ.

"భోజనం వడ్డించనా ?" సౌమ్యంగానే అడిగింది కాంచన అటునుంచి యిటు ఒత్తిగిల్లుతూ, చాలా అసౌఖ్యంగా ఉండేస్థితి అది. అందుకే భర్తను చూడగానే లేవలేక పోయింది.

"అక్కర్లేదులే" దుస్తులు మార్చుకుంటూ అసహనంగా అన్నాడు, "నా అతీగతీ ఎవళ్ళకి కావాలి? పశువుల్లాగా తినడం పడుకోవడమే. ఇంకా పన్నెండైనా కాలేదు, అందరూ గుర్రుపెట్టి నిద్రపోతున్నారు. నీకేమో నన్ను చూచికూడా మంచం దిగబుద్ధి కావడంలేదు."

కాంచన కోపం తెచ్చుకోలేదు. ఎలాగైనా అతడిని బాగుచేసుకొని సంసారం దిద్దుకోవాలనే కోరికతోనే ఉన్నదామె. అందుకే లేచి దగ్గరగావెళ్ళి అతడి భుజాలపై చేతులుఆనించి, చెంపకు చెంప ఆనిస్తూ అన్నది.

"ఇక మీరు మీ విసుగుదలలూ చిరబరలూ కట్టి పెట్టాలి." కొంటె నవ్వుతో తెచ్చి పెట్టుకున్న చిరుకోపంతో అన్నది.

"ఏం, ఏమిటో సంగతి?" మామూలుగానే అడిగాడు బూట్లు విప్పుకుంటూ. బాగాత్రాగి వచ్చాడు. ఆ వాసనకు ఆమె నాశికాపుటాలు బ్రద్ధలయ్యేటట్లున్నాయి. అయినా భరించటం ఆమె అలవరచుకున్నది.

"ఇక మీమీద అధికారంచేసే మహారాజు వస్తున్నాడు. 'నాన్నా ఇంతవరకూ ఎక్కడున్నావ్' అంటూ చెవులు మెలేసి అడుగుతాడు" అత్యానందంతో ఒళ్ళో వాలిపోతూ చెప్పింది. "మీ ముక్కుపట్టి ఆడిస్తాడులెండి." అన్నది తానే కొంటెగా అతడి ముక్కుపట్టి ఊపుతూ.

ఆమె ఆశించినట్లుగా అతడినుండి అభినందన పరంపర కురియలేదు. అనురాగధారలు వర్షించలేదు. ఆ సువార్తా

శ్రవణం అతడిలో ఏ అలరింపూ కలుగజేయకపోగా చీకాకుగా ముడిపడ్డాయి అతడి కనుబొమలు. "చాలా ఘనకార్యం చేసావ్ లే." విసుగ్గా ఒడినుంచి తప్పించుకుంటూ లేచాడు. "పశువులూ పక్షులూ-సకల జీవరాసులూ కంటున్నాయి పిల్లల్ని. ఈ మాత్రపు ఘనతకు మురిసిపో నవసరంలేదు. కొన్నాళ్ళపాటు నీకు పీరసాలూ, మందులూ. ఆ తర్వాత "కేర్" "కేర్" లూ భరించలేక చావాలన్నమాట నేను. బాగుంది, చాలా బాగుంది కానీ, నాలుగు మెతుకులు పడేయి. అర్ధరాత్రి దాటుతోంది!"

గతం అన్నీ మరచి, అమరసుఖాన్ని అందించి పొందు దామనీ, నట్టింటనడయాడబోయే పాపాయి నవ్యజీవితాన్ని అందించగలడనీ ఆశతో అంతవరకూ భర్తరాకకు ఎదురు చూచిన కాంచన అలా అధఃపాతాళానికి విసిరివేయబడింది. నిర్దయగా, ఆ మెలో మిగిలివున్న కొలది పాటి ఆశకూడా సమసిపోయింది.

తన అవసరాలన్నీ ఎక్కడో తీర్చుకుని తప్పత్రాగి వచ్చిన గోపాల్ భోజనం ముగిస్తూనే నిద్ర కొరిగితే, భస్మీ

పటలమైన ఆశలతో వర్షింపనలవికాని నైరాశ్యంతో బీటలు వారిన హృదయంతో తలగడ తడుపుతూ గడిపింది కాంచన.

"భగవాన్! నీకు గంగాజలం ప్రీతిదాయకమనీ, పంచామృతాభిషేకం పరమ యిష్టం అనీ అంటారు కానీ, నీకు అన్నిటికంటె అశ్రుజలం మహా యిష్టం కదూ? అమృతమూర్తివని నమ్మి నిన్నే ఆరాధించే అబలల అశ్రువులతో అభిషేకం చేయించుకొంటూన్న అంతర్యామీ! నీ వెంత కఠినుడవు!"

"బావా!" మనసు బాధపడిన వేళ భగవంతునితో పాటు బావ కూడా స్మరణకు వస్తాడు. "నా బ్రతుకులాగా నీ బ్రతుకు కాకూడదు. నీవు హాయిగా ఆనందంగా వెయ్యేళ్ళు వర్ధిల్లాలి. స్వర్గానికి ప్రతిరూపమై, ఆనందానికి నిర్వచనమై, శాంతికి నిలయమై విలసిల్లాలి నీ సంసారం." మనసారా కోరుకొన్నది కాంచన.

ఆనాటి నుండి గోపాల్ తనను మరింత నిర్లక్ష్యం చేస్తూ,

అధికభాగం ఎక్కడో గడుపు తూన్నట్లుగా కాంచన గ్రహించింది.

విరక్తితో ఆమె మనసు ఆ రోజు కా రోజు శిలలా మరిపోతూన్నది. అతి ప్రేమగా దరిజేరబోయిన తనను అతడెంత హీనంగా విదిలించాడో అనేది అనుక్షణం ఆమె గుండెలలో మెదలుతూ గుండెను పిండి వేస్తూన్నది.

ఇంతటి బాధపై మరలా ఈ సమ్మెటపోటు! ఎప్పటికి వస్తాడో! వచ్చి మఱలా ఏమడుగుతాడో, ఏమి రభస చేస్తాడో!

రానే వచ్చాడు పది రోజుల అనంతరం గోపాల్. అనగా సరిగా నెల తర్వాత తిరిగి వచ్చాడు.

"ఏం కాంచనా, ఎట్లాగున్నావ్ !"

నెల్లాళ్ళై చూచిన భార్యను, నిండుమనిషిని, భర్త పలుకరించే తీరు యిదేనా! ఎవతెవతెతోనో శృంగారంగా తిరిగే వాడికి అర్థాంగిని ఆప్యాయంగా అక్కున జేర్చుకొనడం ఎలా వస్తుంది మరి?

నీరసంగా పడుకొనివున్న కాంచన లేచి అతడికి మౌనంగా మంచినీళ్ళిచ్చింది.

"ఏమిటలా ఉన్నావ్? ఇంట్లో ఎవరికైనా జబ్బ గానీ........" అర్థోక్తిలో ఆపేశాడు.

చురుకుగా చూచింది కాంచన! "ఇంట్లో అంతా బాగానే ఉన్నారు. మీరే ఎలాగున్నారో ఎక్కడున్నారో తెలియక ఏడుస్తున్నాం అందరం."

ఉప్పెనగా వచ్చిన కోపాన్ని అణచుకొంటూ అన్నాడు గోపాల్. వీలైనంత సౌమ్యంగా స్వరాన్ని సాన పెడుతూ: "ఏముందీ, ఇంటిదగ్గర ఏవేవో పనులున్నాయి. తెమలలేదు. అంచేత అమ్మా నాన్నగారూ కదలనీయలేదు నన్ను."

అతడి దెస అసహ్యంగా చూచి, అల్మారా నుండి అతడి తండ్రి ఉత్తరాలను తీసి చేతిలోపెట్టి అతడి ముఖం పరీక్షగా చూడసాగింది కాంచన.

తన అబద్ధం బయటపడిపోయిందన్న కోపంతో, అవమానంతో గోపాల్ ముఖం జేవురించింది.

"ఎందుకు విప్పావ్ నా ఉత్తరాలు?" ఉరిమినట్లుగా అడిగాడు.

"ఈ చాటు మాటు భాగోతాలేమిటో తెల్సుకుందామని" నిర్లక్ష్యంగా అన్నది కాంచన.

"తెల్సుకొని ఏం చేస్తావ్? నన్ను నువ్వు కాపలా కాయలేవు."

"హుఁ! అంత ధీమా ఉన్నప్పుడు ఈ అబద్ధాలు దేనికి ? ధైర్యంగా నిజమే చెప్పవచ్చుగా!"

"నోర్ముయ్. నాకు కోపం తెప్పించకు."

"కోపం!" హేళనగా అన్నది కాంచన. "ఔను. సీతాకోక చిలుకలతో విహరించి వచ్చిన వ్యక్తికి నిండుగా కన్పిస్తూ భారంగా నడుస్తూన్న భార్యపై కోపం రాదుమరి? నాపై కోపం; నేనంటే అసహ్యం; నామీద చిరాకు; నామీదే వెగటు. ఇక మీరు ఎందుకొస్తున్నట్టు నా దగ్గరకు ? నా డబ్బు, నా డబ్బు కావాలి, అంతేగా? నెలలునిండుతూ, ప్రసవించడానికి సిద్ధంగా ఉన్న భార్య క్షేమ సమాచారం కూడా తెల్సుకోకుండా నెలల తరబడి ఎక్కడో పడుండే భర్త కూడా ఓ భర్తేనా ?"

"చాలా గొప్పదానవు బయల్దేరావ్ లే. మహా నువ్వొక్కతివే అలసిపోతున్నావ్. ప్రపంచంలో ఇంకెవరూ పిల్లల్ని కనటంలేదు! నెలల తరబడి అయిపులేకుండా పోయిన మీ బావ కోసం అలమటించిన దానికి ఒక్క నెల భర్త కన్పించకపోతే తప్పు!"

ఈ ధిక్కార వచనాలకు మరింత బాధపడింది కాంచన.

"హుఁ! తనను సుఖపెట్టి, తనకోసమే జీవితమను కుంటూ, తన ప్రతిరూపాన్ని మోస్తూ, తన వంశం నిలప టానికి ప్రాణమొడ్డుతూన్న భార్యకు, ఒక విద్యావంతుడూ, డాక్టరు అందించే అభినందనా, కృతజ్ఞతా ఎంత మధురంగా ఉన్నాయి!"

"ఏం, ఊరుకున్నకొలదీ చాలా వదరుతున్నావ్? ఆడ దాన్నవి గుర్తుంచుకో."

హుంకరిస్తూ, అమితమైన ఆవేశంతో అతడు కొట్టిన చెంపదెబ్బకు కాంచన స్పృహతప్పిపోయింది వెంటనే.

# 17

నాలుగు నెలల అనంతరం కూతురూ, అల్లుడూ తిరిగి వస్తున్నారంటే ఎక్కడా నేలమీద కాలు ఆనడంలేదు జనార్దనరావుకు. రత్నకు పెళ్ళి ఔతుందనీ, యింత మంచి భర్త ఆమెకు లభించగలగనీ, అతడు కలనయినా ఆశించ లేదు, ఊహించలేదు. ఎప్పటికప్పుడు మాధవ్ ఉత్తరాలు వ్రాస్తూనే ఉన్నాడు మామగారికి. అయితే అవి కేవలం క్షేమ సమాచారాలు, ఏ ఏ ప్రదేశాలు తిరిగి చూశారో ఆ వివరాలూ అంతే. కానీ, రత్న అలాగే పెంకెగా మతి మాలిన దానిలా ఉన్నదా లేక ఏమైనా కాస్త బాగుపడిందా అనే ఆయన ఆరాటానికి ఆ ఉత్తరాలలో సమాధానం దొరి కేది కాదు. "ఏదో డాక్టర్లు చెప్పారు కానీ, పిచ్చిదానికి బాగేమిటిలే. ఇక అంతే నా రాత, ఆ కట్టుకున్నవాడి ఖర్మానూ" అనుకొని ఉసూరు మనేవాడు. అయితే, నాల్గు రోజుల క్రితం రత్న స్వయంగా వ్రాసిన ఉత్తరం అందు కున్న ఆ తండ్రి ఆనందానికి పట్టపగ్గాలు లేకుండావున్నాయి.

ఎంతో పొందికగా వున్నాయి అక్షరాలు. ఇంత అందంగా పొందికగా ఆమె అదివరకెన్నడూ రాయడం అతడు చూడ లేదు. కోడికెక్కిరించినట్లుగా నాలుగక్షరాలు రాసి పుస్త కాలు విసిరేసేది. ప్రణామాలతో ప్రారంభించి, యోగ క్షేమాలు విచారించి, రాబోతున్న రోజును వివరించి నమ స్కారాలతో అంతమైన ఆ వుత్తరం—సమాంత స్వహస్త లిఖితమైన ఆ లేఖ అమృతభాండంనలె వున్నది జనార్దనరావు పాలిట. నాలుగు రోజులలో రాబోతున్నారు! నాలుగు యుగాలు కాదూ?

ఆ యింటి యజమాని నుండీ బంధువులూ నౌకర్లూ అందరికీ ఆత్రుతగానే వున్నది, అమ్మాయిగారూ చిన్నబాబు గారూ తిరిగి వస్తున్నారంటే. "అమ్మాయిగారు మామూ లుగా అయిందా?" అందరి మనసులలో అనుమానమూ అదే. "ఆ! ఆ పిచ్చిది బాగాతే యింకేం? ఈ మాధవు డేమన్నా దేవుడా ఏమిటి? అమాంతంగా మంత్రం వేసి పిచ్చిదాన్ని మంచిదానిగా మార్చేందుకు? చూస్తాంగా?" ఇదీ అనసూయమ్మ అసూయపూరితమైన వ్యాఖ్య.

కోదండం కోటి దైవాలకు మొక్కుతున్నాడు. రత్న మరింత పిచ్చిదై, మాధవ్ మతి కూడా భ్రమించాలని! ఇంట్లో చెట్టంత మనిషి తానుండగా ఈ దారినపోయే

దానయ్య వచ్చి ఇలా అనుకోకుండా క్షణాలలో రత్నను స్వంతం చేసుకుంటాడని అతడు భావించనేలేదు. అందుకే రత్నా మాధవుల వివాహమైన నాటినుండీ అతడి పని కల్లు తాగిన కోతి చందమైంది. రత్న పిచ్చిదై పిల్లా జెల్లా లేకుండాపోతే ఇక దాయాదులలో దగ్గరవాడు తానే నాయె ఆ ఆస్తిని కబళించటానికి!

అందరూ ఎదురుచూస్తూన్న రోజు రానే వచ్చింది.

స్టేషన్ దిగి చెయ్యీ చెయ్యీ పట్టుకు నడచి వస్తూన్న రత్నా మాధవులను నేత్రానందకరంగా తనివితీరా చూడ సాగాడు జనార్దనరావు. ఇది కలా, నిజమా?

వస్తూనే తండ్రికి పాదాభివందనం చేసి, "నా మీద బెంగపెట్టుకున్నావా నాన్నా, అంతగా చిక్కిపోయావు?" అనడిగింది రత్న. ఆ మాటలలో ఎంతో ఒద్దికా, అణకువా తోచాయి జనార్దనరావుకు.

"నాకేం బెంగ తల్లీ! హాయిగా కూతురూ అల్లుడూ చిలకాగోరింకల్లా తిరుగుతూంటే" అన్నాడు కుమార్తె తల ఆప్యాయంగా నిమురుతూ—

సిగ్గుతో తల వాల్చుకుంది రత్న, మాధవ్ దెస క్రీగంట చూస్తూ.

రత్న సిగ్గుపడటమా ? ! హైందవ యువతీ సహజమైన సిగ్గును ఆమెలో ఇదివరలో ఎన్నడూ ఎవరూ చూచిఉండ లేదు. లోగడ ఉన్నదే వెకిలి చూపూ, వెకిలి నవ్వూ కూడ ఇప్పుడామెలో ఛాయామాత్రంగా కూడా గోచరించడం లేదు.

ప్రపంచాన్నే జయించినంత సంతసంతో నాట్యమాడింది రాఘవ హృదయం.

"మాధవా!" వెల్లువలై పారుతూన్న ఆనందంతో, మాటలు కరువయిన పరిపూర్ణ సంతృప్తితో ఆలింగనం చేసుకున్నాడు అల్లుడిని.

"బాగున్నావా అనసూయమ్మా ? ఎలాగున్నావ్ కోదండం ? రామన్నా కులాసానా ...........?" అంటూ పేరు పేరున రత్న అందరినీ పలుకరిస్తూంటే ఆ ఆరిందాతనం చూచిన అందరికీ ప్రపంచంలోని అద్భుతాలలో కెల్ల అద్భుతాన్ని చూస్తూన్నట్లైంది.

ఇల్లుజేరి కాఫీలు త్రాగిన తర్వాత రత్న స్నానానికి వెళ్ళింది. మామా అల్లుళ్ళు కబుర్లలో పడ్డారు.

"ఫ్యాక్టరీ వ్యవహారాలన్నీ సవ్యమే కదా ?" మాధవ్ అడిగాడు.

"ముందిది చెప్పు ?" జనర్దనరావు తగ్గుస్వరంలో అడిగాడు కొంచెం మొగమాట పడుతూ, "రత్న నిన్నేమైనా విసిగించి వుంటే.....................నేను క్షమాపణ కోరుతున్నాను"

"లేదండీ లేదు. పెద్దలు మీ రలా మాట్లాడకూడదు." అంటూన్న మాధవ్ ముఖంలో క్షణకాలం సిగ్గుతెర కదలి పోయినట్లు అన్పించిన జనార్దనరావు తృప్తిగా నవ్వుకున్నాడు.

అతడి జీవితంలో బండరాయిలా నిలచిన ఒకే ఒక గడ్డు సమస్య అతి సులభంగా సౌమ్యంగా పరిష్కరింపబడి పోయింది. భగవానుడే మాధవుని రూపంలో అవతరించి తన్ననుగ్రహించాడా ?

సాయంత్రం బ్రహ్మాండమైన విందు నేర్పాటు చేశాడు జనార్దనరావు.

ఇంతటి కోటీశ్వరుని కుమార్తె వివాహం ఇంత రహస్యంగా ఎందుకు జరిగిపోయిందో తెలియక చెవులు కొరుక్కునే వారే అందరూ.

అందరూ మాధవుని ఈర్ష్యగా చూచేవారే.

"మైగాడ్! ఈ మాథవ్‌గాడేదో మంత్రగాడి లాగున్నాడే! నిజంగానే రత్న బ్రాగైపోయింది. పార్టీలో అతిధులతో ఎంత హుందాగా ప్రవర్తిస్తోంది!" లోలోన ఆశ్చర్యపోతూ పళ్ళు కొరుక్కున్నాడు కోదండం.

"ఆఁ. ఇదెన్నాళ్ళ సంబరంలే. రోగాలు తిరగబెటినట్లే పిచ్చి కూడా తిరగ బెడ్తుందట. ముందుంది ముసళ్ళ పండుగ." సరిపెట్టుకుంది అనసూయమ్మ.

విందు ముగిసిన అనంతరం. అల్లుడికి ఏదో చెప్పాలని పై అంతస్థుకు వెళ్ళిన జనార్ధనరావు అల్లంత దూరానే ఆగిపోయాడు, పండువెన్నెట్లో పరిసరాలనే మఱచివున్న జంటను చూచి.

"వుండు. ఒక్కసారి మీనాన్నగారికి గుడ్‌నైట్ చెప్పి వస్తాను. ఒక్కసారి వదులు రత్నా." గారంగా బ్రతిమాల్తున్నాడు, రత్న చేతులలో బందీయైన మాథవ్.

"వదలను. ముందు నామాట వినండి."

"సరే, ఆజ్ఞాపించండి."

"రేపు మాత్రం మీరు ప్రోగ్రామూ వెయ్యొద్దని నాన్నగారికి చెప్పండి. ఫ్యాక్టరీకి కూడా వెళ్ళొద్దు మీరు."

"నాకేం మగవాడిని, అందరూ నిన్నే నవ్వుతారు, భర్తని కొంగున కట్టేసుకున్నదని." కొంటెగా ఆమె బుగ్గ సాగదీస్తూ అన్నాడు.

"అనుకోనీయండి."

"నాల్గునెలలు హాయిగా తిరిగి వచ్చాం. చాల లేదా చెప్పు.. ఇంక నయినా ఫ్యాక్టరీ విషయాలు చూడక పోతే ఎలాగ ?"

"ఫ్యాక్టరీ ఫ్యాక్టరీ. మీభార్య నేనా లేక ఫ్యాక్టరీయా" కోపంతో భర్తను వదలి దూరంగా జరిగి కూర్చుంది.

"పద. దీనికి సమాధానం మీ నాన్నగారే చెప్పాలి." కొంటెగా నవ్వుతూ అన్నాడు.

"చాల్లెండి. రేపు మనం రాధామాధవస్వామి కోవెలకు వెడుతున్నాం. అంతే."

"చిత్తం. ఎందుకో అడగవచ్చా?"

"మిమ్మల్ని—ప్రత్యక్ష దైవాన్ని నాకు ప్రసాదించినందుకు పూజలు చేయించాలి." అంటూన్న ఆమె కనులలో తొణికిసలాడ్తూన్న ప్రేమ, అనురాగం, భక్తి చూచి ప్రత్యక్ష శ్రోత చకితుడయితే పరోక్షంగా వింటున్నవారు ఆనందాశ్రువుల నొత్తుకున్నారు. "నిజంగా: జన్మజన్మలకూ

మీా ఋణం తీర్చుకోలేను. పిచ్చిదానిగా ముద్రింపబడి పోయిన నన్ను మనిషిని చేశారు.''

భార్య కన్నీటిని తుడుస్తూ చేతులలోనికి తీసుకున్నాడు ఆమెను మాధవ్. “చూడు రత్నా, మన మధ్య వుండాల్సింది కేవలం విశ్వాసం కాదు!”

“మరి?”

“చెవిలో చెప్తాను.”

“ఊఁ.”

“.........తెల్సిందా?”

“ఛీ! కొంటే.”

ఆనందాశ్రువుల నొత్తుకుంటూ దయామయుడైన భగవంతుని స్తోత్రం చేసుకుంటూ, తాను అలుకితో మాట్లాడుదామనుకున్న విషయాన్ని ఎల్లుండికి వాయిదా వేసుకుంటూ నిశ్శబ్దంగా నిష్క్రమించాడు జనార్దనరావు అక్కడి నుండి.

చంద్రుడు కూడా మబ్బుల మాటుకు తప్పుకోవడం మంచిదని భావించి వుంటాడు.

# 18

కాంచన భర్తతో పూర్తిగా మాటలు మాను కున్నది! అతడిని పూర్తిగా తప్పించుకు తిరగడమే కాక, ఇహ లోక చింతనే లేనట్లుగా వుంటూన్న ఆమెను చూచి అందరూ కలవరపడ్డారు.

ఆనాడు గోపాల్ ఇంట్లోనే వున్నాడు. భార్యతో ఆ నాడు ఘర్షణ తర్వాత మళ్ళీ ఏమీ గొడవే లేదు. ఎంతో సౌమ్యంగా, సరళంగా, నెమ్మదిగా వుంటున్నాడు. చెల్లెలి ఆవేదనను గ్రహించిన కేశవ్ ఆనాడు గోపాల్‌తో మాట్లాడ నిశ్చయించుకున్నాడు.

గోపాల్‌ను తన గదిలోకి పిల్చి కూర్చోబెట్టి అడిగాడు. "ఏమిటి గోపాల్! కాంచన ఎప్పుడూ అదోలా వుంటుంది. నీవేమో విసుగ్గా వుంటావ్. ఏమిటసలు మీ సమస్య? కాంచనను నువ్వు కావాలని కోరి వివాహ మాడావ్ కదా ?"

గోపాల్ ఏదో దీర్ఘాలోచనలో వున్నట్లు కన్పించాడు, ఏమీ సమాధాన మీయకుండా.

"మనం బావ మరదులమని మరచిపోయి స్నేహితులుగా మాట్లాడుకోవచ్చు కదా గోపాల్?"

"చెప్పమంటావా అయితే?"

"అడుగుతున్నాను కదా?"

"కాంచన మనస్సులో నాపై గౌరవం లేదు. ప్రేమ లేదు. పెళ్ళి తర్వాత తనే మనస్సు సర్దుకుంటుందని ఆశించి చేసుకున్నాను. ఇప్పటికీ ఆమె మాధవ్‌ను మరచి పోలేదు. అతడు వ్రాసిన ఉత్తరం ఒకటి నా చేత బడ్డింది."

"ఆఁ!" ఆశ్చర్యపోయాడు కేశవ్.

"నేనేమీ నిందారోపణ చేయటంలేదు. ఇదిగో కావలిస్తే చూడు ఈ ఉత్తరం. ముందుది చింపిపారేశాను కాంచన ఎదుటే. ఇది మాత్రం నా చేతిలోనే పడింది. కాంచనకు చూపలేదు."

చూసిన కేశవ్ సిగ్గుతో తలెత్తలేకపోయాడు. అది మాధవ్ వ్రాతే! అంతకు ముందు వ్రాసిన ఉత్తరం మరచి పొమ్మనీ. కాంచన వివాహం సంగతి తనకు తెలియనందువల్ల అలా ఏదేదో వ్రాసినందుకు క్షమార్హుడననీ అన్నాడు

"నన్ను మరచిపో కాంచనా. మరచిపొమ్మని అనడం సుల భమే. అయినా అది ఎంత అసాధ్యం. కానియ్. భగవదేచ్ఛ అలాగున్నది. కలకాలం బిడ్డాపాపలతో సుఖంగా వర్ధిల్లమని ఆశీర్వదిస్తూ—మాధవ్."

"చూశావా నీ చెల్లెలి ప్రవర్తన? వాడికి బుద్ధుందా యిలా పరాయిదానికి వ్రాయటానికి? పైగా అడుగడుగునా నేను డబ్బుకోసమే తనను వివాహమాడినట్లుగా అనుమానిస్తూ మాట్లాడ్తుంది. కేవలం ఈ బాధను మరచిపోవటానికే నేను త్రాగి పడివుంటున్నాననీ మీ కెవరికీ తెలియదు." కన్నీళ్ళతో డగ్గుత్తికతో చెట్టంతమనిషి అబలలా బాధపడ్తూ వెళ్ళబోసుకుంటూంటే కేశవ్‌కు చెల్లెలిని ఆ క్షణంలో నరికి ముక్కలు చేయాలన్నంత కోపం కలిగింది. "ఛీ! ఇదింత మూర్ఖురాలని అనుకోలేదు. దాన్ని దార్లో పెట్టే బాధ్యత నాది. నువ్వేం ఖంగారుపడకు గోపాల్. కొంచెం ఓర్పు వహించు, స్నేహితుడనైన నా కోసం" అంటూ చేతులు పట్టుకున్నాడు.

నేర్పుగావున్న తనకథనాన్ని కేశవ్ నమ్ముతున్నాడని తెలియగానే గోపాల్ కన్నీరు అధికమైంది. "నిజంగా మగవాడు భరించగల బాధేనా యిది కేశవ్? ఈ బాధను మరువటానికే నేను కాశ్మీరు పోయాను. అయితే, అక్కడకూడా దైవం

నాకు శాంతి నీయలేదు. ఆ ద్రోహుడు ఎవతో బంగారుపిచి కను పట్టాడు. హాయిగా కాశ్మీర్‌లో విహరిస్తున్నాడు. ఖరీ దైన బట్టలూ, విదేశీకారూ వాడూ...ఇవిగో-ఈ ఫొటోలు చూడు, అప్పుడు నమ్ముతావు. చాటుగా తీశాను.” రత్నా మాధవ్ పెట్టాపట్టాలేసుకు తిరుగుతూన్న ఫొటోలవి కేశవ్ మనసు మండి పోయింది “దుర్మార్గుడు, తన మటుకు తను సుఖంగా పూలరంగడిలా తిరుగుతూ మధ్యన దీని మనసు పాడు చేస్తున్నాడు. అయినా పెళ్ళయినదానికి దీనికి బుద్ధుం డద్దూ? అంతా సర్దుకుంటుంది. నేను కాంచనకు నచ్చచెప్పు తాను. నువ్వు తొందరపడకు.” బ్రతిమాలుతూ అన్నాడు.

లోలోన గర్వంగా నవ్వుకున్నాడు గోపాల్. పరువు ప్రతిష్టల కోసం ప్రాకులాడేవాళ్ళ నోళ్ళు మూయించటానికీ చెప్పినట్లు ఆడించటానికీ యింతకంటే ఏం కావాలి? వాళ్ళ ఆడపిల్ల జీవితమూ, తద్వారా వారి యింటి పరువూ గౌర వాలూ తన గుప్పిట్లో వున్నవాయె!

రత్నా మాధవ్‌ల ఫొటోలు చూసి కేశవ్ తల వాచేట్లు చీవాట్లుపెట్టినా కాంచన కిమ్మనలేదు. “దుర్మా ర్గాలు నేర్చినవాడికి కుయుక్తులూ కథలూ చెప్పటం మాత్రం

రాదా? అతడు ఏకాంతంలో తనతో ఎంత నీచంగా మాట్లా
డ్తాడో. కనీసం ప్రథమ సమాగమం నాడైనా ఏ మురిపమూ
లాలనా లేకుండా ఎలా విడిలించి చిన్నబుచ్చాడో అన్న కేం
తెల్సు! ఆడదైన తాను అటువంటివి నోరువిప్పి చెప్పకో
గలదా! మాధవ్ ఉత్తమహృదయుడు. ఎవరో అదృష్ట
వంతురాలు వివాహమాడి ఉంటుంది. అందులో తప్పేముంది?
అతడు వ్రాసినదానిలో మాత్రం ఏమి తప్పుంది వీళ్ళింతగా
బాధపడటానికి. గోపాల్ తన పథకానికి అనుగుణంగా ఈ
అన్ని సంఘటనలనూ కూర్చాడు; అంతే, ఆ నాటకం వీళ్ళ
కర్థంకావడంలేదు.''

ఆమె అనుకున్నట్లే అయ్యింది. "నేనింకా పైకిచదువు
తాను కేశవ్. విదేశాల్లో అయితే ఓ ప్రక్క చదువుతూ
మరో ప్రక్క జాబ్ చేయటానికి అవకాశముంటుంది. ఈ
రోజుల్లో ఎంత చదివితే అంత గొప్ప. అదీగాక ఈ దూరం
కాంచన మనస్సును కొంత మార్చవచ్చు. ఎడబాటువల్ల
ఆమెకు నా ప్రాముఖ్యం తెలిసి నాపై ప్రేమకలుగవచ్చు. నిత్యం
కీచులాడుకుంటూ ఇక్కడ నే నుండలేను'' అన్నాడు గోపాల్
ఓ సుదినాన. కేశవ్ నిలువునా నీళ్ళుగారిపోయాడు. గోపాల్
చేస్తూన్న ఆరోపణలన్నీ పూర్తిగా నిజంకాదని అతడికీ తెల్సు.
అయితే తాము నోరెత్తలేని ఆయుధం గోపాల్ చేతిలో

వున్నది. కాంచన బ్రతుకూ, మన పరువూ నిలవాలంటే అతడు కోరినదిచ్చి విదేశాలకు వెళ్ళనీయడమే. ఆపైన మన అదృష్టం. అల్లరి చిల్లరిగా తిరిగిన వాళ్ళెందరో బాగుపడి చక్కగా బ్రతకడం మనం చూస్తున్నాంకదా? మన చేతు లతో మనం పరిస్థితులను విషమింపజేయలేదనే తృప్తి అయినా ఉంటుంది, ముందు ముందు ఏం జరిగినా." అని సలహా ఇచ్చాడు కేశవ్ తండ్రికి.

"కాంచన ప్రసవించేవరకైనా వుండవా?" అన్నాడు గోపాల్‌తో ఆఖరియత్నంగా.

"వద్దులే. నా నీడ ఆ బిడ్డమీద పడినా అసహ్యించు కుంటుంది కాంచన. నేను లేకపోతేనే బహుశః ఆమెపుట్టిన శిశువును సరిగా పెంచుతుంది" అన్నాడు గోపాల్ లేని దీనత్వం తెచ్చుకుని.

రెండెకరాల పొలం అమ్మి నోరు మూసుకుని అల్లుడు అడిగినంతా ఇచ్చాడు నారాయణమూర్తి.

కాంచన నిర్లిప్తంగా వుండిపోయింది.

ఇటు కాంచనకు నొప్పులు ప్రారంభమయ్యాయి. అలా బయలుదేరి వెళ్ళిపోయాడు గోపాల్, వెళ్ళేముందైనా భార్యతో ఆదరంగా ఒక్కమాట మాట్లాడకుండా. "సుఖ

ప్రసవం వద్దు. నాకు మరణం వస్తే ఎంత బాగుండును!" అనుకొన్నది నీరసంగా, హాస్పిటల్ బెడ్‌పై పడుకొన్న నిర్భాగ్యురాలు కాంచన.

# 19

మాధవ్ విరక్తితో ఒకనాడు తనకెవరూ లేరని నిశ్చయించుకున్నా, కాలక్రమాన ఆ బింకం సడలసాగింది, ఇంటినుండి పదేపదే వస్తూన్న ఉత్తరాలను చూచి. రత్న కూడా "మీ ఇంటికి వెళ్దాం. నాకు అందర్నీ చూడాలనుంది" అని అప్పుడప్పుడూ అడుగుతూన్నది.

"అత్తవారిల్లంటే ఆడపిల్లలు భయపడిపోతారు. నీకు సరదా ఏమిటి?" అని నవ్వేస్తూ విషయం ఎగరగొట్టేశాడు మాధవ్ ఒకసారి.

మరోసారి "నిజంగా నీ అంత నువ్వు అత్తింటికి వస్తానంటే నాకెంత ఆనందంగా వుందనుకున్నావ్! కాని నీవంటి

సుకుమారి అక్కడ ఒక్క క్షణం నిలవలేదు రత్నా. నీవు పెరిగిన పరిసరాలూ, వాతావరణం అన్నీ వేరు. అక్కడ నువ్వు ఒక్కపూట కూడా తినలేవు. ఓ రోజు కూడా వుండ లేవు. చాలా సాధారణగృహాలుమావి; అతి మామూలు జీవితాలు" అన్నాడు ప్రేమగా ఆమె బుగ్గలు నిమురుతూ.

"ఫర్వాలేదు మీ ఇల్లూ, మీ పరివారం నేను చూడవద్దూ ఒక్కసారైనా ?"

"సర్లే, ఐతే వెళ్దాం ఎప్పుడైనా."

ఫ్యాక్టరీ వర్కర్స్ అంతా మాధవ్‌ను దేమునివలె చూస్తున్నారు. వారికి అదివరకులేని సౌకర్యాలెన్నో చేయించాడతడు. ఈ ఏడు లాభాలు బాగా వచ్చాయ్. అదంతా మాధవ్ కృషివల్లా నిపుణతవల్లనేనని జనార్ధన రావుకూ అందరకూ కూడా తెల్సు.

మాధవ్ లేనిదే ఒక్క క్షణమైనా ఫ్యాక్టరీ నడపలేననేటంతగా ఇప్పుడు జనార్ధనరావు అతడిపై ఆధారపడి యున్నాడు. తన ఇంటిని స్వర్గంగా, మనసును ప్రశాంతి నిలయంగా మార్చిన మాధవ్ జనార్ధనరావుకు ప్రాణాధికం.

సరసంగా సాగిపోయే జీవితాలలో అలలు సృష్టించి అశాంతిని రేకెత్తించడం ఆ సర్వేశ్వరునికి సంతోషమేమో అన్పిస్తుంది.

"తండ్రి మరణశయ్యపై వున్నాడనీ వెంటనే రమ్మనీ" వచ్చిన టెలిగ్రాం చూచి కొయ్యబారిపోయాడు మాధవ్. మామూలుగా ఎన్ని మనస్పర్థలున్నా మరణకాలంలో అవి మరుగునపడి మమతలుపైకి తేలుతాయి.

మాధవ్‌నూ రత్ననూ హడావుడిగా ప్రయాణానికి తయారుచేయడమేకాక, మాధవ్ వద్దని వారిస్తూన్నా తానూ వెంట బయల్దేరాడు జనార్దనరావు. "క్రొత్తచోటు, అత్తిల్లు. అందులోనూ ఇటువంటి పరిస్థితులలో ప్రప్రథమంగా వెళ్తోంది. కాస్త ఆడసాయం అవసరం" అనుకుంటూ వెంట అనసూయమ్మను కూడా బయల్దేరదీశాడు. ఆమె వెంట తోక కోదండం కూడా ఉన్నాడు.

ఆఖరు ఘడియలలోనున్న అనంతయ్య ఘరానా ఇంటి అల్లుడైన కొడుకునూ అందాలరాశి కోడలినీ చూచి ఆనంద బాష్పాలు రాల్చాడు. మూగగానే కృతజ్ఞతలు తెల్పాడు వియ్యంకునికి.

"బాబూ, నాపై కోపం పెట్టుకోకు ఇక. నేను వెళ్లిపోతున్నాను. దైవం అంతా మన మేలుకే చేస్తాడంటారు. అలాగే నమ్ము. ఇక ఈ ఇంటిభారం నీది" అంటూ కళ్ళు మూశాడు అనంతయ్య కనుచీకటివేళ.

హాహాకారాలు మిన్నంటాయి.

ఇటీవలి క్రోధమూ, పట్టుదలా మరచిపోయి కదలి కదలి ఏడ్చాడు మాధవ్ తండ్రి మృతదేహంపైబడి. ఆ ఒడిలో కూర్చుని గారాలుపోవడం, ఆ భుజాలు ఎక్కి ఆడుకోవడం. అదికావాలి ఇదికావాలి అని అడిగి తీర్చుకున్న బాల్యం. "నా తండ్రి—నా రత్నం" అంటూ తండ్రి తనను ప్రియమార అక్కునజేర్చుకుని ముద్దాడటం—అన్నీ ఒక్కటొక్కటిగా గుర్తుకు రాసాగాయి. అయిపోయింది; దేహం భస్మమైపోయింది; ప్రేమ క్రోధ మద మాత్సర్యపూరిత ప్రపంచంనుండి జీవుడు ఎగిరిపోయింది.

తాత్కాలిక వైరాగ్యం ఆవరించింది మాధవ్‌లో.

మూడవనాడు మాధవ్‌కు ధైర్యం చెప్పి తాను వెళ్లిపోయాడు జనార్ధనరావు. "రత్నను తీసుకుపొండి. ఆమెకు ఇక్కడ కష్టంగా వుంటుంది" అన్నాడు మాధవ్.

"ఫర్వాలేదు. ఉండగలను" అన్నది రత్న. ఇంత కష్టంలో మిమ్మల్ని వదలి నేను పోను" అంటూన్న ఆమెను అభిమానంగా చూచాడు మాధవ్.

"ఏమి కావాలన్నా సందేహించవద్దు మాధవ్. వెంటనే కబురుచేయి" అల్లుడిని మరీ మరీ హెచ్చరించి కూతురికి సాయంగా అనసూయమ్మను వదలి వెళ్లిపోయాడు

జనార్దనరావు. ఒక కారును కూడా మాధవ్‌కు వదలి వేశాడు.

ఇంత ఘోరం, జరిగినా చెల్లెలికి వైధవ్యం సంభవించినా నారాయణమూర్తి ఆ ఒక్కనాడే ముక్తసరిగా వచ్చి పరామర్శించి వెళ్ళిపోయాడు భార్యాసమేతంగా. కేశవ్ కూడా వచ్చాడు. అంతటి విచారంలోనూ మాధవ్ కనులు కాంచనకోరకై వెదకి వెదకి నిరాశపొందాయి.

ఇన్నాళ్ళుగా ఊరునూ, తనవారినీ వదలి ఈనాడు అతి గొప్పవాడై తిరిగి వచ్చిన మాధవ్‌ను గురించి వివరాలు తెల్సుకోవాలని తహతహలాడే లోకులకు అనసూయమ్మా, కోదండం బాగా దొరికారు. అసలే వ్యర్థమైన వాగుడుకూ లేనిపోని అనవసర గొడవలకూ పడి చచ్చే అనసూయమ్మకు మాధవ్ కుటుంబ వివరాలన్నీ తెల్సుకునే మహదవకాశం లభించింది. ఇంకేం, ఆమెకు పెన్నిధి దొరికినంత సంబరంగా ఉన్నది.

అనంతయ్య శ్రాద్ధకర్మలు ముగిశాయి. బంధువు లంతా వెళ్ళిపోయారు.

"కాంచన ఎలాగుంది ?" ఒకనాడు యథాలాపంగా అడిగినట్లు అడిగాడు మాధవ్ చెల్లెలు రేణుని.

రేణు సమాధానం చెప్పలేదు. తల్లి ఎక్కడ

వింటుందోననే భయంతో ఖంగారుగా అటు ఇటు చూడ సాగింది.

"ఏం, ఏమిటి ? ఇంకా గొడవలు అలాగేవున్నాయా? బంధుత్వం లేదా ?"

"లే" దన్నట్లు తలవూపింది రేణు.

"ఏం జరిగిందసలు ?" చెప్పు వివరంగా.

ఇక చెప్పక తప్పలేదు రేణుకు.

"నువ్వు వెళ్లిపోయాక గొడవలు ఎక్కువైపోయాయి. కాంచన వదిన పెళ్లి ఆ గోపాల్‌తో జరిగిపోయింది."

"ఊఁ, తర్వాత ?"

"తర్వాత...అతడసలు మంచివాడు కాదట. వదిన పాపం ఎప్పుడూ ఏడుస్తూనే ఉంటుందట. ఆ మధ్య-ఆమధ్య గోపాల్ దెబ్బలాడి విదేశాలు వెళ్లిపోయాడట."

వింటూన్న మాధవ్ కడుపులో దేవినట్లే అయ్యింది.

"ఇంతకూ కాంచన ఆ పెళ్లి ఎందుకు చేసుకున్నది ?"

"ఏమో !"

"ఎందుకు చేసుకుంటుంది ?" వెనుకనుంచి వస్తూన్న పార్వతి అన్నది. "పెద్దవాళ్ళు చేస్తే చేసుకుంటుంది."

తల్లి ముఖంలోని కాఠిన్యాన్ని చూచి విస్మయమందాడు

మాధవ్. "కాంచన-తనకోడలు అని మురిసిపోయిన అమ్మ నేడు ఆమె పేరెత్తడానికే అయిష్టత ప్రదర్శిస్తోంది!"

అప్పటికప్పుడే చెప్పులు తొడుక్కుని వెళ్ళడాని కుద్యుక్తుడౌతున్న కుమారుని కటువుగా అడిగింది పార్వతి "ఎక్కడికి?"

"కాంచనను చూడాలి" స్థిరంగా అన్నాడు.

"వీల్లేదు" పార్వతి శాసించినట్టే అన్నది "నీ తండ్రి చనిపోతే పరాయివాళ్ళందరిలాగే తొంగిచూచిపోయాడే నీ మామ? సిగ్గులేదూ? ఆనాడు నిన్ను అలాగ అవమానించి విదిలించకపోతే నువ్విలా దేశాల పాలయ్యేవాడివేనా?" ఆమె కంఠంలో దుఃఖపు అలలుసుడులు తిరుగుతున్నాయి.

"అమ్మా!" స్థిర గంభీరస్వరంతో అన్నాడు. "అంత పట్టుదలేవుంటే నేనసలుయిక్కడ కూడా అడుగుపెట్టకపోయి వుందునే! అన్నీ మరచివచ్చాను. కాంచన నాకు ప్రాణంకంటే అధికమైనది ఒకనాడు. ఈనాడు కనీసం కంటితో కూడా చూడ వద్దని శాసించటం అన్యాయం. ఈ పట్టుదలలూ, కావేషాలూ అన్నీ మీ పెద్దవాళ్ళు పెంచుకొన్నవి. కాంచన అమాయకు రాలు. ఏమీ తెలియదు. నేను వెళ్ళటానికే నిశ్చయించు కున్నాను."

"వెళ్ళు, ముఖాన పేడనీళ్ళు జల్లుతారు!" క్రోధంగా అనేసి రివ్వున వెనక్కు తిరిగి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

మాధవ్ వెళ్ళేసరికి ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది.

అరుగు మీద వున్న నారాయణమూర్తి "ఎవరూ? ఓ నువ్వా" అని తిరిగి తన కాగితాలలో మునిగిపోయాడు.

ఆ నిర్లక్ష్యాన్ని సరకు జేయకుండా మాధవ్ లోనికి వెళ్ళాడు. వంటింట్లో కొంచెం అలికిడౌతూ వుండడంవల్లఅటు నడిచాడు.

కూరలు తరుగుతూన్న అత్త ఒక్కసారిగా "నువ్వా బాబూ! ఇంకా మేం జ్ఞాపకం ఉన్నామా?" అంటూ కంట తడి పెట్టుకుంది.

పీటవాల్చి కూర్చోమన్నట్లు సౌంజ్ఞ చేసింది.

ఇద్దరి హృదయాలూ బరువుగా ఉన్నాయి.

"నిన్ను కాలదన్నుకొన్నందుకు అష్టకష్టాలు అనుభ విస్తున్నాం మధూ. నీకే చేసివుంటే కాంచన బ్రతుకింత అన్యాయమై పోయేదా?" అంటూ కదలి కదలి ఏడ్వ సాగిందామె.

"ఏమిటత్తయ్యా? ఏం జరిగిందసలు?" మాధవ్ ప్రశ్న.

"అయ్యో, ఇంకేంజరగాలి నాయనా?" మరింతఅధిక మైంది ఆమె దుఃఖం, "గోపాల్ విడాకులు అడుగుతున్నాడు. కాంచనతో పెళ్ళికాకముందే వాడికి లండన్‌లో పెళ్ళాం ఉందిట."

"ఏమిటీ?" వేయిపిడుగులు ఏకకాలమందు వర్షించినట్లే అయ్యింది మాధవ్ స్థితి వెర్రివాడిలాగా చూడసాగాడు.

అలాగే ఏడుస్తూ మధ్యమధ్య చెప్పసాగింది, "ఎప్పుడూ

ధనదాహమేవాడికి. ఓనాడు రెండువేలు, ఓనాడునాలుగువేలు మరోనాడు పదివేలు — పిల్లనిచ్చుకున్నాం కదా అని అలాగే భరించాం. తప్పత్రాగి వచ్చి, అది ఏమైనా అంటే నిర్దాక్షిణ్యంగా కొట్టేవాడు. ఒకటి రెండుసార్లుస్పృహకూడా తప్పిపోయింది. ఏదోలే మనం కలుగజేసుకుంటే ఇంకా పాడైతాడేమోనని మేంనోళ్ళు నొక్కుకునే వాళ్ళం. నలుగురైదుగురు నర్సులతో విచ్చలవిడిగా తిరిగేవాడట. అన్నిటికీ కాంచన అలా నోరుమూసుకు భరిస్తూంటే నా కడుపు తరుక్కుపోయేది. ఇంకా అంతడబ్బు పంపు, ఇంత డబ్బు పంపు అని వాడితండ్రి ఉత్తరాలు. ఇన్నీ చాలక ఓ దొరసానిని తీసుకొచ్చి ఓ పదిరోజులు యింట్లో పెట్టాడు. దాని కూడా "అనితా అనితా" అని కుక్కలా తిరిగేవాడు. స్నేహితుగాలనీ,దానివెంట వచ్చినవాడు దానిపంజాబీమొగుడనీ చెప్తే నమ్మాం. ఇప్పుడు తెలిసింది — వీడు ముందుసారి లండన్ వెళ్ళినప్పుడే దాన్ని పెళ్ళి చేసుకున్నాడట. ఆ వెంట వచ్చినవాడు దాని మొగుడు కాదట. ఊరికే సాయంగా వచ్చిన స్నేహితుడెవడోనట! వీడు మళ్ళీ ఎంతకీ లండన్ తిరిగి వెళ్ళకపోవడంతో అది వీడిని వెతుక్కుంటూ వచ్చిందన్న మాట!"

"ఎంత గుండెలు తీసినవాడు!" వింటూన్న మాధవ్ అన్నాడు, గుండెలు పిండే బాధతో.

"ఇదుగోచూడు — ఈ కోటకే షాగావేశాను నీ

కోసం—అని చెప్పి దాన్ని తెచ్చి మనింట్లో పెట్టాడన్న మాట! పట్టుచీరెలూ, నగలూ—నాలుగువేలు ఖర్చుచేశాడు దాని కోసం. దానికి యిద్దరుపిలలుకూడా వున్నారట. ఇప్పుడు పోయి లండన్‌లో దానితో కలిసే వున్నాడట. ఎన్ని ఉత్తరాలకూ జవాబులేదు. ఆఖరుకు యిప్పుడు విడాకులు కావాలని వ్రాస్తున్నాడు. మంచిదికాదు. నేన టే యిష్టంలేదు. అదీ యిదీ అని వ్రాస్తున్నాడు."

"ఒకతె ముండే ఉండగా ఎందుకిలా కాంచన బ్రతుకు తీసినట్టు?"

"అదే నాయనా మరి! ఈ దేశంవాళ్ళు మహా ధనవంతులని అపోహాలో ఒక్కొక్కతే అలా మనదేశం వాడిని చేసుకుంటుందట—కేశవ్ అంటున్నాడు ఆ తెలుపూ సొగసూ చూచి భ్రమతో వీడు చేసుకుంటాడు. ఆ తర్వాత అది డబ్బకోసం పీడిస్తే దాని ధనదాహం తీర్చటానికి ఇలాగ ఎవరి యింటికో నిప్పపెట్టి ఏమీ తెలియని దాని గొంతు కోస్తారట డబ్బుకోసం"

"ఎంతఘోరం ?"

చాలాసేపు మౌనానంతరం "కాంచన ఏదీ? ఎక్కడుంది?" అనడిగాడు.

"ఎక్కడుంటుంది? అత్తమామల కసలక్కర్లేదు దాని గోల. వాళ్ళంత నీచులు గనకే వీడింతనీచుడు. ఆ పుట్టిన

పిల్లాడు బ్రతికినా దానికింత వ్యధవుండకపోను. పది నెలలు పెరిగినట్లే పెరిగి వాడు దాటిపోయాడు."

"అదేమిటి?"

"నీ కసలేమీ తెలియవా మాధవ్ మా విషయాలు?" కామాక్షి అడిగింది.

"తెలియవత్తయ్యా. ఇప్పుడేగా నేనీవూరు వచ్చింది మళ్ళీ."

"సరిగా కాన్పుకోసం కాంచనను హాస్పిటల్‌లో జేర్చిననాడే వెళ్ళిపోయాడు గోపాల్. అతడికి మనస్సెలా ఒప్పిందో తెలియదు. మూడ్రోజులు చావు బ్రతుకులమధ్య ఊగింది. మా ప్రాణాలెగిరిపోయాయి. మగబిడ్డ పుట్టాడు. వాడిని చూచుకుని కొంత సంతోషంగా వున్నట్లే కన్పించింది. పది నెలలు పెరిగాడు. ప్రాకుతూన్నట్లే కన్పిస్తూంది ఇంకా కంటికి." కళ్ళు తుడుచుకుంటూ చెప్పింది. "డీసెంట్రీ వచ్చి పోయాడు. అంతే కాంచన రాయిలాగఅయిపోయింది. ఆనాటి నుంచి ఈనాటి వరకూ మళ్ళీ నవ్వు అనేదిగానీ ఏడుపనేదిగానీ లేదు అలా రాయిలా కూర్చుంటుంది. మరీ అవసరమైన మాటలేవో మాట్లాడ్తుంది. అంతే. ఇష్టమైతే తింటుంది. ఒక్కోప్పుడు వరసగా నాలుగేసి రోజులు ఏమీ తినదు. అంతా మా ఖర్మ నాయనా డబ్బుతో ఎంతో హోదాగల అల్లుడిని తేగలమనుకున్నాం గానీ, నుదుటి రాత ఆను మార్చలేమని అనుకోలేదు! రోజూ పోయి ఆ స్మశా

నంలో కూర్చుంటుంది. మొదట్లో వెతుక్కొనే వాళ్ళం. రాను రాను అలవాటైపోయింది.''

"భగవంతుడా? ఏమిటిది? కలకలలాడవలసిన నా కాంచన బ్రతుకెందు కిలాగై పోయింది?" తల్లడిల్లిపోతూన్న హృదయంతో బరువుగా కాంచన గదివేపు నడిచాడు.

నిశ్శబ్దంగా వుంది. గది తలుపులు మూసివున్నాయి.

చిన్న శబ్దం చేశాడు తలుపుల మీద మాధవ్.

వెంటనే తలుపులు తెరుచుకున్నాయి. కాంచన లైటువేసి అతడివేపు చూచింది. అతడిని చూచిన సంతోషం గానీ, ఆవేశంగానీ ఏమీలేవు ఆ కనులలో. పాలిపోయి చిక్కిపోయి వున్న ఆ నీరసాకృతిని రాయిలా నిలబడి చూడ సాగాడు మాధవ్ గుండెలు పగిలే బాధతో. కాంచన అందమంతా ఏమైపోయింది? కాంతిని కోల్పోయిన ఆ కనులు గాజుగుడ్లలా వెలవెలబోతున్నాయే! ఆ తల దువ్వుకొని ఏనాడైందో!

"నువ్వా బావా? బాగున్నావా? రా కూర్చో." పెదవులు కదలీ కదలనట్లు మాట్లాడింది. అతడికి కుర్చీ చూపి తాను మంచం మీద కూర్చుంది.

' పరామర్శింప వస్తే ఎదురు ఆమె పలకరించడంతో ఏం మాట్లాడాలో తెలియక మూగవోయి కూర్చున్నాడు.

"ఒకటిగా పెనవైచుకోవాలని ఎన్నెన్ని కలలు గన్నాం? కడకు ఏమయ్యాం?" ఇద్దరి మనసులూ ఒకలాగే

స్పందిస్తున్నాయి. రెండు హృదయాలూ యుగళమై ఏడుస్తున్నాయి.

"నిన్ను ఇంకసలు చూడగలననుకోలేదు." అన్నది పొడిగా.

ఆ కళ్ళు ఎక్కడో చూస్తున్నాయి. వుండి వుండి ఏమిటోగా మాట్లాడ్తోంది. "నువ్వు చాలా సుఖంగా వున్నావని విన్నాను. రత్న చాలా బాగుంటుందటగా? నీ జీవితం ఎప్పుడూ హాయిగా గడిచిపోవాలి బావా! నీ కే బాధలూ రాకూడదు." నిశ్చింతగా వున్నది గొంతు.

"నువ్విలా వుంటే........నేను సుఖంగా ఎలా వుండగలుతాను కాంచనా? నీ బాధలు విని నేనెంత ఏడుస్తున్నానో నీకేం తెల్సు?"

"ఎందుకూ? ఏడవొద్దు. ఎవ్వరూ ఏడవొద్దు. అందరి బదులూ నేనే ఏడుస్తాను. అంతా హాయిగా వుంటే అంతే చాలు" ఏ మాటలోకూడా దుఃఖపు ఛాయగానీ, ఆవేశపు పొరగానీ లేదు. అతి సాధారణంగా వుంది గొంతు.

బల్లమీదున్న పసివాడి ఫోటోను తదేకంగా చూడసాగాడు మాధవ్.

అది చూచిన కాంచన లేచి, ఫోటో తెచ్చి మాధవుని చేతికిస్తూ, "ఏడాది కూడా పెరగలేదు. నా మీద వాడికి అసహ్యం కలిగి వెళ్ళిపోయాడు" అన్నది.

ఒకొక్క మాట గుండెలను తీండుతూన్నట్టుగా వున్నది

మాధవ్‌కు. ఏదో బొమ్మ యాంత్రికంగా మాట్లాడినట్లు న్నది కానీ సజీవంగా వున్న మనిషి మాట్లాడుతున్నట్లు అన్పించటం లేదు మాధవ్‌కు.

"ఏం వచ్చావ్?"

కేశవ్ కోపంగా ప్రవేశించాడు. "ఇంతవరకు నువ్వు చేసిన నిర్వాకం చాలు. నడు బయటికి." తర్జని చూపుతూ అన్నాడు.

"కేశవ్!"

"ఔను. కేశవ్‌నే. బుద్ధిలేదూ, పరాయిదాని గదిలో కూర్చుని మాట్లాడటానికి? నీ ప్రాణానికి ఉసూరుమంటూ దాని బ్రతుకెలా మోడైపోతోందో చూశావా? నడు ఎప్పుడూ ఈ ఇంట అడుగుపెట్టకు."

"వెళ్లిపో బావా. నన్ను చూశావుగా?" నిశ్చలంగా అన్నది కాంచన.

తన గదికి ఎలా వచ్చాడో, అతడికే తెలియదు. ఎన్నెన్ని తెఱగులుగా ఆ మనసు ఏడుస్తోందో వర్ణనకు అతీతం.

"కాంచనా, ఇలా మోడువారిన నిన్ను చూడటానికే ఇలా నేనిక్కడికి రావలసి వచ్చిందా?

నేనెంత నిర్భాగ్యుడను! ఎంత పాపండుడను. నీ కష్టాలు చూచి నేనింకా ఎలా జీవించి ఉన్నాను!"

రాత్రంతా అశాంతిగా అటూ ఇటూ దొర్లుతున్న అతడిని రత్న ఎన్నోసార్లు అడిగింది, "అలా ఉన్నారేం?" అని.

"ఏం లేదు రత్నా. నా బాధలు నీ కెందుకు? పడుకో." అని మాత్రమే అన్నాడు.

"నేనేం చేయగలను కాంచనా? నీ కోసం నేనేం చేయగలను." మౌనంగా వాపోయాడు.

"ఏమీ చేయలేను. ఎవ్వరూ ఏమీ చేయలేరు. ఆడదానికి ఇటువంటి జీవితం వైధవ్యం కంటే ఘోరమైనది. మందులేని వ్యాధుల వంటిది. కసాయివాడితో ముడిపడిన స్త్రీ బ్రతుకు ఈ దేశంలో. దీనికంతకూ నేనే కారణం. నేనే కారణం. నా పాపానికి పరిష్కృతి లేదు."

పాపం—రోజూ పోయి శ్మశానంలో గడిపివస్తుందట! ఎంతటి హృదయ విదారకమైన సంగతి! భర్త త్యజించి వెళ్ళిపోయాడు. బిడ్డను దైవం లాక్కుపోయాడు. ఇక ఆ దీను రాలు ఏం చేస్తుంది?

ఆమె హృదయమే శ్మశానవాటిక ఐపోయినట్లున్నది.

# 20

"కాంచన వచ్చింది. కాంచన వచ్చింది" ఇంట్లో అందరూ సంతోషంగా విస్తారంగా అంటూంటే అప్పుడే మధ్యాహ్న నిద్రనుండి లేచిన మాధవ్ విని ఆశ్చర్య పోయాడు. కాని పక్కమీదనుంచి కదలలేదు. అలాగే పడు కొని వింటున్నాడు. కాంచనకు ముఖాముఖీ ఎదురుపడాలంటే అతడికి ముఖం చెల్లటంలేదు. సిగ్గుపడిపోతున్నాడు.

"కులాసానా అత్తయ్యా?" కాంచన కంఠం విన్పిస్తోంది.

"ఏం కులాసాలేవే? మనందరి బ్రతుకులూ ఓలాగే ఏడుస్తున్నాయి. రా కూర్చో" అది పార్వతి గొంతు. "చాలారోజుల కొచ్చావు మళ్ళీ. రెండేళ్ళైపోలేదూ నువ్వీ గడప త్రొక్కి?" నిందారోపణగా అంటోంది పార్వతి.

"నువ్వేగా అత్తయ్యా రావద్దన్నావు!" కాంచన అడిగింది.

"నేనా? నేనన్నానటే? ఇది చాలా బాగుంది."

"మర్చిపోయావా అత్తయ్యా. ఆరోజు—బావఅసలు ఇల్లు వదలి ఎందుకు పరారయ్యాడో తేల్చుకుందామని నేను వస్తే నువ్వేమన్నావు? నా దురదృష్టమే ఇంకా పెళ్ళైనా కాకుండానే బావని బాధిస్తోందన్నావు కదా? అందుకే నేను

బావ జీవితంనుండి పూర్తిగా తప్పుకొన్నాను. నువ్వన్నది అక్షరాలా నిజం. నా పెళ్ళి నా జీవితం వేరుదారిన పడ్డాక బావ అదృష్టవంతుడయ్యాడు. సంఘంలో విలువైన మనిషయ్యాడు."

ప్రత్యక్ష పరోక్ష శ్రోత లిరువురూ అదిరిపడ్డారు.

వలవలా ఏడ్చింది పార్వతి.

"అందుకనే తల్లీ! ఆ దిక్కుమాలిన పెళ్ళి చేసుకుని బ్రతుకిలా తగలేసుకున్నావు? ఏదో నా బాధలో నేనన్నాను కాని నీమీద నాకేం కోపం? నామీద ఇంత కోపం పెట్టుకొని ఈ గడప కూడా త్రొక్కడం మానివేశావా?"

"ఎందుకులే అత్తయ్యా ఇప్పుడవన్నీ! ఐపోయింది. నా నిష్క్రమణ బావకి నిజంగా మంచిదే అయింది. బావ భార్య వచ్చిందని విన్నాను. చూచి వెడదామని వచ్చాను"

మాధవ్ మది వెయ్యివ్రక్కలయింది.

"కాంచన ఎందుకిలా చేసింది? నా కోసం ఎదురు చూడలేక గోపాల్‌ను చేసుకొందా? అని అహరహం అతడిని వేధించుతూన్న ప్రశ్నకు సమాధానం ఈనాడు దొరికింది. ఆమెకు తనపై అసహ్యం లేదు. తన పట్ల ఆమె మదిలో అలాగే చెక్కుచెదరని ప్రేమ ఉన్నది.

"ఛ! అమ్మ ఇంత హీనమైన మాటలు అని చిన్నబుచ్చిందా కాంచనను? మేమిద్దరం ఇలా విడిపోవటానికి కారణం అమ్మేనా?"

తాను తెచ్చిన చీరా, నెక్లెస్ రత్నకు ఇచ్చి కొంచెం

సేపు కూర్చుని వెళ్లిపోయింది కాంచన. మాధవ్ గది బయటకు రానేలేదు.

కాంచన వచ్చి వెళ్లిన తర్వాత అతడి మనఃస్థితి మరీ అల్లకల్లోలంగా తయారైంది.

కొంతసేపు హృదయాన్ని చల్లబరచుకొనేందుకు అలా బయటకు వెళ్లిపోయాడు.

# 21

సాయం సమయం.

మాధవ్ కాళ్ళు అతని మనస్సుతో ప్రమేయం లేకనే అలా అలా తీసుకుపోసాగాయి పొలాలవైపు. ఖననభూమిలో తండ్రి సమాధివద్ద ఎంతోసేపు అలా అన్యమనస్కంగా కూర్చునిపోయాడు. చేజేతులా తండ్రి అంత్యక్రియలు సలిపిన అతడికి మాటిమాటికి జనన మరణాల రహస్యాన్ని గూర్చిన ఆలోచనలు అసంఖ్యాకంగా కలుగుతున్నాయి.

అలా అలా ఆలోచిస్తూ నలువైపులా దృష్టిని బరపిన మాధవ్‌కు అనతి దూరంలో తనవలెనే ఓ స్త్రీమూర్తి అన్యమనస్కంగా ఒక తులసి మొక్కవద్ద కూర్చున్నట్లు అనిపించింది. పరీక్షగా, ఆరాగా చూచాడు. స్మశానంలో ఒంట

రిగా స్త్రీ! "ఎవరయి ఉంటుంది?" దగ్గరగా వెళ్ళిన మాధవ్ ఉలిక్కిపడ్డాడు.

ఆమె కాంచన!

తులసికోట పై చేతులుంచి! ఆ చేతులపై తల ఆన్చుకొని బాహ్యస్మృతి లేనట్లుగా కూర్చుని ఉన్నది.

"కాంచనా!" మనస్సు ద్రవించిపోగా ఆర్ద్రంగా పిలుస్తూ ఆమె శిరసున చేయి వేశాడు.

కళ్ళు విప్పి చూచిందే కాని కాంచన ఏమీ మాట్లాడలేదు.

"లే, ఏమి టిక్కడి కొచ్చావు ఒంటరిగా? వాన వచ్చేట్లుంది చూడు మరీ?" మేఘావృతమైన ఆకాశాన్ని చూస్తూ అన్నాడు.

"ఫర్వాలేదు. వాన మనుష్యుల నేం చేయగలదు?"

నిర్వికారంగా అన్నది, కూర్చున్న తావునుండి లేవకుండా.

"ఎందుకు చెప్పు అసలిక్కడ కూర్చున్నావు? ఇదేం ప్రదేశమో తెలుసా?"

"తెలియకేం? ఎవరు చేరుకోవలసిన తావయినా ఇదేగా?"

అదిరిపడ్డాడు మాధవ్. "కాంచనా!" అన్నాడు వెర్రిగా.

"ఔను బావా! బాబుని ఇక్కడే పాతిపెట్టేశారు.

సరిగ్గా ఇదే సమయం. వాడు నన్ను వదలిపోయినా నేను వాడిని వదలలేక రోజూ వస్తుంటాను. ఇక్కడ కూర్చుంటే ఏమిటో వాడు నవ్వుతూ ప్రాకుతూ నా దగ్గరకు వస్తున్నట్టే అనిపిస్తుంది."

దీనాతిదీనమైన స్థితిలోనున్న ఆమెను ఏమని ఓదార్చగలడు తాను!

"నేను ప్రేమించిన అందరూ నన్ను విడిలించుకుపోతున్నారు బావా? ఏమిటో తెలియదు. అయినా నాలో యీ ప్రేమ నశించిపోదు. పిచ్చిదానవని ఇంట్లో అంతా విసుక్కుంటున్నారు. నువ్వే చెప్పు — నా బిడ్డను చూసుకోవటానికి రావటం పిచ్చా? నన్నే ప్రేమించని నీవు నా బిడ్డను పెంచడానికి మనస్కరించక చంపేశావని రాశాడు గోపాల్. కడుపు శోకంతో అల్లాడే భార్యకు ఎంత మంచి ఓదార్పు ఇచ్చే భర్తో చూశావా?"

ఏమి సమాధానం చెప్పగలడతడు?

"నడు కాంచనా నడు. అదుగో చూడు—సన్నని తుంపరకూడా ప్రారంభమైంది!" అన్నాడు అనునయంగా.

"ఫర్వాలేదులే. కాసేపు ఇక్కడే కూర్చుందాం హాయిగా."

కాంచన కదలలేదు.

ఆమెను ఒంటరిగా వదలి అతడు వెళ్ళలేదు. ఒకవంక చీకటి పడవస్తూన్నది.

చినుకులు కొంచెం దట్టంగా పడుతూంటే కాంచన తప్పనిసరిగా లేచింది. ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు. అంతకంతకూ వాన అధికమౌతూన్నది.

మనుష్యులు పూర్తిగా తడిసిపోయాయి.

"చిన్నప్పుడు మనం పొలాలలో ఆడుతూ, పరుగు లెట్టిన రోజులు గుర్తున్నాయి కదూ బావా ?" హఠాత్తుగా అన్నది కాంచన.

"ఊఁ."

"దూరంగా— ఆకాశమూ భూమి కలుస్తున్నట్లు కన్పించే ఆ చోటును చూద్దామని ఎంతెంత దూరం పరుగు లెత్తేవాళ్ళం. ఎంతదూరం పరుగెత్తినా ఆ దిక్చక్రం ఇంకా అంత దూరంగానే కన్పించేది. ఊహలోనేగాని దానికి ఉనికి లేదని తెలియని అమాయకపు రోజులవి. ప్రేమ వెంట పరుగులు పెట్టటం కూడా అటువంటిదే. దిక్చక్రాన్ని చూడలేనట్లే నిజమైన ప్రేమనూ చూడలేం, పొందలేం."

"ఔను."

మాధవ్ మనసులో కూడా ఆ రోజులు ఒక్కసారిగా కదలాడాయి.

"ప్రేమకు ఊహానామమే కాని యదార్థ స్వరూపం లేదు. నా అనుభవం నేర్పినదిది."

ఎంతటి జ్ఞాని ఐపోయింది కాంచన!

"వాన ఎక్కువగా ఉంది, ఈ గుళ్ళో ఆగుదాం కాస్సేపు."

ఇద్దరూ ఆలయంలో ఓ అరగంట కూర్చుని అలా చిన్ననాటి తలపోతలతో కాలం గడుపుతూండగా వాన కాస్త తెరిపి ఇచ్చింది.

"నడు, త్వరగా వెళ్ళిపోదాం."

ఇద్దరూ ఆలయం బయటకు వస్తూండగా కారు వచ్చి ఎదుట ఆగింది. రత్నా, కోదండమూ ఉన్నారందులో.

రత్న మాట్లాడలేదు. ఇద్దరినీ ఎగాదిగా చూడసాగింది.

కోదండం చూపులలో కొంటెతనం కన్పట్టింది.

కాంచనగానీ, మాధవ్‌గానీ ఎటువంటి సంజాయిషీలూ చెప్పుకోలేదు.

మౌనంగా ఎక్కి కూర్చున్నారు.

"ఇంకా మీరు ఒక్కరే వచ్చారేమో—ఎక్కడ అవస్థపడుతున్నారోనని వెదుక్కుంటూ వచ్చాం." వెకిలి నవ్వు నవ్వుతూ అన్నాడు కోదండం.

"నేను రావటం ఒక్కడినే వచ్చాను. ఇక్కడ కాంచన కలిసింది. తన గురించే ఆగాను. నే నొక్కడినే అయితే వానయినా వచ్చేసే వాడినిగా?"

మరి సంభాషణ సాగలేదు.

"ఆవిడని ఇంటిదగ్గర దిగవిడచి వస్తాను." అని వెళ్ళిపోతూన్న మాధవ్‌ను చూస్తూ తల పంకించింది అనసూయమ్మ.

"ఎవరమ్మా ఆ కారులో అమ్మాయి? మీ ఆయనకు నిశ్చయమైన పెళ్ళికూతురు ఆవిడేనటగా!" ఆరాగా అడిగింది రత్నను.

"కాబోలు. నాకు తెలియదు." దుస్తులు మార్చుకుంటూ అన్నది రత్న.

"ఔను తల్లీ! నీకేం తెలియదు." వగలు కురిపిస్తూ అన్నది. "ఈ పిల్ల మూలంగానే నటగా మీ ఆయన దేశాలుపట్టి పోయినది. పెళ్ళి తర్వాత ఆ పిల్ల భర్తకు వీళ్ళ భాగోతం తెలిసి విరక్తిపుట్టి అదేదో దేశం పోయాడట. విడాకులకు కేసు జరుగుతోందట కోర్టులో."

"అలాగా?" కాంచనా మాధవ్‌లు ఆలయంనుండి తడి దుస్తులతో బయటకు వచ్చిన దృశ్యం. ఎంతో ఆత్మీయుల మాదిరిగా మాట్లాడుకుంటూ కన్పించిన దృశ్యం ఆమె మనోపథంలో మెరిశాయి. ఆ అనసూయమ్మ నడ్డించుతూన్న విషం మెల్లగా ఎక్కుతోంది రత్నకు.

"ఇలా నోరుమూసుకుంటే లాభంలేదమ్మా. రానిచ్చి నాలుగూ దులుపు. అవ్వ—దానితో అంత పబ్లిగ్గా షికారులా? ఆఁ—ఇప్పుడు తెలిసింది. అందుకే నీ కంత ప్రేమగా చీరా, నెక్లెసూ తెచ్చింది. లేకపోతే అంత ఖరీదైన నగ ఎవరైనా బహుమానం ఇస్తారా?"

విషం నరనరంలోనికీ ఎక్కిపోయింది రత్నకు. "నీకు వాళ్ళిళ్ళు తెలుసా?" అనడిగింది.

"తెలుసమ్మా." అనసూయమ్మ సమాధానం.

"చీరా, నెక్లెసూ తీసుకెళ్ళి మొఖాన కొట్టిరా. నాకేం అక్కరలేదు, ఆయన్ని రానీ, అడిగేస్తాను ఈరోజు కాకుంటే రేపు."

"తప్పకుండా అడగాలమ్మా. లేకుంటే ఆటలు అలాగే సాగుతాయి. మీ నాన్నగారు నన్నిక్కడ నీతో ఉంచి వెళ్ళిందెందుకు? నీమీద ఈగ వాలకుండా చూడ మనికామా ఇక్కడేం జరిగినా బాధ్యతంతా నాది తల్లీ."

రత్న అణువణువూ రోష క్రోధాలతో సెగలు క్రక్కసాగింది.

కాంచనను గురించి ఇంకా వివరంగా రేణూను అడిగి తెల్సుకొని ఇంకా కోపం పెంచుకొన్నది.

"ఎంతటి చతురుడు మాధవ్! అంత తీయగా, హాయిగా ప్రవర్తిస్తాడు? ఇంత చరిత్ర వెనక ఉండగా ఎంతటి లోతు గుండె!" వివాహానంతరం ప్రప్రథమంగా భర్తపై కోపమూ, ఏహ్యతా కలిగాయి రత్నకు.

# 22

తాను గదిలోకి వచ్చినా కదులూ మెదులూ లేకుండా పడుకొనివున్న రత్నను కొన్ని సెకనులు ఆశ్చర్యంగా చూచాడు మాధవ్. కారణం, సాధారణంగా ఆమె వేళకాని వేళల్లో నిద్రపోదు.

"రత్నా, ఒంట్లో బాగులేదా?" అనడుగుతూ దగ్గరగా కూర్చుని నుదుట్పై చేయి వేశాడు!

ఆ చేతిని విసురుగా ఒత్తిగించుతూ, ప్రక్కకు తిరిగి పడుకుంది రత్న, కళ్ళు మాత్రం విప్పి చూడకుండానే.

అమితమైన—అవధులు దాటిన ఆశ్చర్యానుభూతిని పొందిన మాధవ్ కొలదిసేపు అలాగే చూస్తూ కూర్చుని పోయాడు. ఇదికూడా రత్నలో తానెన్నడూ చూడని విశేషణమే. ఇంతవరకు తనపై రత్నకు కోపం రావడము, అలిగి పడుకోవడము అనేది చూడలేదు. ఇదొక క్రొత్త అనుభూతి అతడికి.

"ఏమిటి రత్నా, ఏమిటి?" ఆమెను తనవైపు త్రిప్పుకుంటూ అడిగాడు. "మీ నాన్నగారు గానీ గుర్తుకు వచ్చారా?" అనికూడా అడిగాడు.

కోపంగా అతడిదెస చూచిందేకాని నోరు విప్పలేదు రత్న.

"ఏమిటో చెప్పనిదే నాకెలా తెలుస్తుంది చెప్పు?" చుబుకం పట్టి లాలనగా అడిగాడు.

శివంగిలా లేచింది రత్న. "కాంచనను మీరు ప్రేమిం చారు కదూ?"

అనుకోని యీ ప్రశ్నకు అప్రతిభుడయ్యాడు మాధవ్.

"అలా చూస్తారేం? మీ రహస్యం నాకు తెల్సి పోయిందనా?"

"... ......... ......... ........"

"మీరు జవాబివ్వరు. నాకు తెల్సు. ఎలా, ఏం చెప్ప గలరు మరి! నేను మీ వూరికి వెళదాం — అని ఎప్పుడన్నా ఎప్పటికప్పుడే వద్దని అడ్డుపుల్ల వేసేవారు. ఇందుకేగా?"

కాళ్ళ క్రింద భూమి కదలి బ్రద్దలౌతున్నట్లుగా అను. భూతి చెందిన మాధవ్ స్తంభీభూతుడే అయ్యాడు

క్రమంగా రత్న రోషం ఏడుపులోనికి దిగింది. "మీ మనసులో ఎవరో వుండగా నన్ను మీ రెందుకు చేసు కున్నట్లు? ఎందుకు నా గొంతు కోసినట్లు?"

"రత్నా!" అప్పటికి కాస్త ప్రయత్నపూర్వకంగా మాట్లాడగలిగాడు మాధవ్. "ఏదీ నా ముఖం చూసి అను. నీ గొంతు నే కోశానని మనస్ఫూర్తిగానే అంటున్నావా?" చుబుకం పట్టి ఆమెను తనవైపుకు త్రిప్పుకుంటూ అడిగాడు.

"మరి నేను విన్నదేమిటి? నేనింకా పిచ్చిదాన్ననుకుంటున్నారా, ఏమీ తెలియక పోవటానికి?"

"అబ్బబ్బబ్బ, పిచ్చీ పిచ్చీ పిచ్చి! ఈ మాటను నేను

మరచిపోయినా నువ్వు మరువలేకుండా వున్నావే? ఎందు కలా పదే పదే నిన్ను నీవు కించపరచుకుంటావు?"

"పాపం! ఎంత ప్రేమ ఎంత గౌరవం నాపై!" ప్రపంచంలోని హేళన అంతా ఆ స్వరంలోనూ, ఆ చూడ్కులలోనే కురుస్తోంది.

"రత్నా!" ఇక సహించలేని మాధవ్ ఆగ్రహంగా అదలింపుగా అన్నాడు.

రత్నలో మార్పులేదు. అలాగే నిర్లక్ష్యంగా చూస్తూ అన్నది. "మీ అరపులకూ, కేకలకూ నేనేం బెదిరిపోవడం లేదు నే ననదలచుకొన్నది అని తీరుతాను. నేను పిచ్చి దాన్ననీ, నాకు మీ ఆటలు తెలియవనీ, అనుకొని నన్ను చేసుకొన్నారు. నా డబ్బంతా దక్కించుకోవచ్చనీ నా మెడకు ఉచ్చు బిగించారు................"

అప్పటికీ మాధవ్ అదుపుదాటి పోతూన్న ఆగ్ర హాన్ని బలవంతంగా అణుచుకొంటూ అన్నాడు; "రత్నా! ఒక్కసారి ఆ ఆవేశం చల్లార్చుకొని నేను చెప్పేది విను, నన్ను రెచ్చగొట్టకు."

"వినను. వినను." మొండిగా అన్నది. "మోసాలు నేర్చిన వాళ్లెన్ని కల్లబొల్లి కథలైనా అల్లి చెప్పగలరు. నా కళ్ళతో, నేను చూసినదానికి ఇంకా నమ్మకుండా నీకాకమ్మ కథలు వినేటంత మూర్ఖురాలినా? నాకు తెలియకుండా, నాకు చెప్పకుండా రోజూ నువ్వు కాంచనను కల్సుకోవటం, ఇంటి

వద్ద దిగబెట్టటం, నిర్జన ప్రదేశాలలో ఏకాంత విహారాలూ? సరసాలూ! ఓహ్, ఎంతటి హీరో వైపోయావ్!"

"నోర్ముయ్." ఇక నిగ్రహించుకోలేని ఆవేశంతో రత్న చెంప చెళ్లు మనిపించాడు "జాగ్రత్త. మరీ పేలుతున్నావు. కాంచనను — సాటిదాన్ని అంత నీచంగా మాట్లాడటానికి నీకు సిగ్గులేకపోయిందా?" అగ్నిని వర్షిస్తున్నాయి అతడి నేత్రాలు.

"ఛీ, పశువా." తీసిపోని కోపంతో అసహ్యించుకుంటూ అన్నది రత్న. ఓ చేతితో చెంప సవరించుకుంటూనే, "బలప్రయోగం మినహా నీ వంటి పశువు చేయగలిగిందేముంది. ఎవతెకోసమో నాపై చేయిచేసుకోగల మొనగాడివైనావన్న మాట. ఇదే స్పష్టం చేస్తోంది నీకు దానిపై ఎంత మమకారమో! నిన్న కనుచీకటివేళ వర్షంలో — తడిసిన గుడ్డలతో నిన్నూ, కాంచననూ దేవాలయంలో ఏకాంతంగా వుండటం నేను చూచాను నా కనులతో. తెలుసా? ఛీ ఛీ. ఇంకా నీతో నాకు మాటలు చాలు."

చలించిపోయాడు మాధవ్. ఇప్పటికి అతడికి అవగాహన అయ్యింది. -- రత్న ఆరోపణ ఏమిటో! కాని ఆమె ఊహించినా మాత్రం అపోహ. కాని ఎలా నచ్చచెప్పాలి. వినగల స్థితిలో ఆమె లేదు. మహావేశంతో ఊగిపోతూన్నది. కాని తాను చేసిన దేమిటి? ఎంతయినా అనుకోని--భార్యపై చేయిచేసుకోవడమా అప్రయోజకునిలాగా! ఛీ. ఆమె అపో

హాను దిద్ది, అర్థమయ్యేట్లు వివరించవలసిన బాధ్యత భర్తగా తనపైన ఉన్నది. ఆ పరిస్థితులలో రత్నే కాదు. ఏ స్త్రీ అయినా అలాగే పెడర్థాలు తీసి, అపార్థం చేసుకుంటుంది.

తన ఆవేశ స్థితినుండి తేరుకొని చూచేసరికి, ధారాపాతంగా వర్షిస్తూన్న కనులతో తన వస్తువులన్నీ సర్దేసుకుంటూన్నది రత్న. ఆవేశం ఎంతటి అనర్థాన్ని అవతరింపజేయబోతూన్నదో ఊహించగలిగిన మాధవ్ నిలువెల్లా కంపించిపోయాడు.

"రత్నా ఏమిటిది? ఏమిటి చేస్తున్నావు?" పెళ్ళి అస్తవ్యస్తంగా సర్దేసి మూత వేస్తూన్న ఆమె చేతిని గట్టిగా పట్టుకుంటూ అడిగాడు.

అతడి కనులలోకి చూస్తూ కట్టుపడకుండా వున్న కన్నీటిని పదేపదే ఒత్తుకుంటూ, మెల్లగా అన్నది రత్న. "తెలియకే అడుగుతున్నారా? నా యింటికి నేను వెడుతున్నాను" ఆ నైరాశ్యాన్నీ, దైన్యాన్నీ గమనించిన మాధవ్ కదలిపోయాడు. "వద్దు రత్నా, నా మాట విను; నలుగురిలో నవ్వులపాలయి నన్నూ నగుబాట్ల పాలుచేయకు. చల్లగా సాగిపోయే సంసారాన్ని రచ్చకీడ్చకు. నేను చాలా తొందరపడ్డాను. క్షమించు. కాని నన్ను పాపిష్టివాడిగా మాత్రం అంచనా వేసుకోకు." బ్రతిమాలుతూ, తన చేతి దెబ్బకు కందిపోయిన ఆమె చెంపను సవరించబోయాడు.

పామును చూచినట్లుగా ఠెవక్కిన అడుగు వేసింది

రత్న. భాషకందని భావాలు పదునులు తీశాయి ఆమె వద నంలో, "నన్ను ముట్టుకోకు." స్వరం మంద్రస్థాయిలో పలి కినా స్థిరంగా, గంభీరంగా ధ్వనించింది. "అయిపోయింది మన సంబంధం. ఇక నీ కోరిక తీరుతుందిలే."

"నా కోరికా?" అయోమయంగా అడిగాడు మాధవ్!

"ఔను. ఆవిడ భర్తనుంచి విడాకులు పొందుతూన్నది. నీవు కూడా ఇక భార్యనుంచి పొందుతావు. ఆపైన స్వేచ్ఛ!?"

"రత్నా! ఎంతటి మాట అంటున్నావ్?"

"ఔను. నేను మాటలదాననే. మీలాగ చేతలు నేర్చిన చతురను కాను. ఇంటికి తీసుకొచ్చి చాలా గొప్ప మర్యాద చేశావ్. జన్మజన్మలకూ మరచిపోను. వెడుతున్నాను."

ఒంటరిగా వచ్చిన కుమార్తెనూ ఆమె ఖిన్నవదనాన్ని చూచిన జనార్దనరావుకు ఏమీ అర్థంకాలేదు. "అల్లు డేడమ్మా?" అనడిగిన ఆయనకు "నాకు తెలియదు నాన్నా." అని సమాధానమిచ్చి ఆయన ముఖమైన చూడకుండా తన గదిలోనికి పోయి తలుపులు మూసుకున్నది రత్న.

"ఏదో కీచులాడు కున్నట్టున్నారు." అనుకొంటూ గుంభనగా నవ్వుకున్నాడు ఆ అనుభవజ్ఞుడు. ఆ విషయమంత పేమంత ముఖ్యమైనదిగా కూడా తీసుకోకపోయినా, అరగంట అనంతరం టాక్సీలో వచ్చిన అల్లుడినీ, చిన్నబోయిన అతడి

ముఖాన్ని చూచి మాత్రం నిజంగా కలవరపడ్డాడు జనార్దన రావు. మాధవ్ ముఖంలో ఆక్షణంలో పెనుతుఫానులు రేగుతూన్నంత అలజడి కొట్టవచ్చినట్లుగా కన్పించిందతడికి!

కానీ భార్యా భర్తల మధ్యవుండే ఈ సంబంధాలూ, కలహాలూ, ప్రేమలూ, అన్నీ కూడా చాలా సున్నితమైనవి వాటంతటవే సర్దుకుంటాయి. వాళ్ళంతట వాళ్ళే తిరిగి సమన్వయించుకుపోగలరు,ఒకతరిపి కారణముచేతనయినా తేడాలు వచ్చినా. అందుకే ఆవిషయమై తానేమీ తరచి తరచి అడగరాదనీ,అడగటం భావ్యంకూడాకాదనీభావించిన జనార్దనరావు "ప్రయాణం సుఖంగా జరిగిందా ? అక్కడంతా కులాసాయేనా?" అవి ఏవో యాధాలాపంగా రెండు మూడు ప్రశ్నలువేసి, సమాధానాలు పొంది వూరుకున్నాడు.

అతడి ముభావతను అపార్థం చేసుకొన్నాడు మాధవ్. రత్న అతడికి అంతా చెప్పి వుంటుందని, అందుకే అంత ముక్తసరిగా వున్నాడనీ భావించిన మాధవ్ ఆ యింట తన విలువ ఒక్కసారిగా అల్పమైపోయినట్లుగా ఊహించికొని లోలోన న్యూనతాభావంతో బాధపడసాగాడు.

# 23

"ఎక్కడికి వెడుతున్నారు? కాంచన దగ్గరకేనా?" ఎక్కడికో బయలుదేరుతూన్న భర్తను కోపంగా అడిగింది.

"రత్నా, నీవు ఎవరివో చెప్పాడు మాటలు విన్నట్లున్నావు. ఆ చెప్పిన వాళ్ళెవరో కూడా నేనూహించగలను. కానీ ఇది......"

"ఆపండి. ఊహించింది నిజమే. ఔను అనసూయమ్మే నాకు చెప్పింది. ఆవిడిది దురుసు స్వభావమే కావచ్చు. అయితేనేం, ఇది అబద్ధం కాదుగా?"

"అబద్ధమే రత్నా. నా దొక్కమాట వింటావా."

"ఏమిటి?"

"నా వెంటరా; ఆ దీనురాలి అసలు చరిత్ర నీకు తెలుస్తుంది. మనం కొలిచే రాధామాధవుడి ఆనగా చెబుతున్నాను."

ఈ ప్రమాణంతో కొంత చలించింది రత్న.

"రా రత్నా, ఇప్పుడే వెడదాం నీకు నా ఒక్కడిపై అనుమానమైతే ఆ అనసూయమ్మగార్ని కూడా తీసుకురా. ఇంకా అనుమానమైతే మీ నాన్నగారినికూడా తీసుకురా."

"నేను రాను; రోజూ ఈ ఊరునుంచి ఆ ఊరు పరుగెత్తాల్సిన అవసరం నాకులేదు."

"సరే, నాకుంది నేను వెడుతూన్నాను." స్థిరంగా అన్నాడు.

"ఔను. ఎందుకు వెళ్ళరు? ఈరోజు ఆవిడ ఉత్తరం కూడా వచ్చిందిగా రమ్మని"

"ఔను, అందుకే వెడుతున్నాను. నీ యిష్టం."

వెళ్ళిపోయాడు మాధవ్.

అనసూయమ్మ ఇంకా పురి ఎక్కించింది రత్నకు. "అబ్బే, ఇలా ఊరుకుంటే లాభం లేదమ్మాయ్. నీ ప్రాణానికే మోసం రాగలదు. దాని దగ్గరకే వెడుతున్నాడు మళ్ళీ. తీసుకెళ్ళు, మీనాన్నని కూడా తీసుకెళ్ళి చూపించు. దారినిపోయేవాడిని తెస్తే ఎంత అనర్థమైపోయిందో బాగా తెలుసుకుంటాడు"

* * *

మాధవ్ మనసు మహా అల్లకల్లోలంగా వుంది. విపరీతమైన ఆందోళనగా వున్నది. కారునడపడం కూడా కష్టంగానే వున్నది. అలాగే మొండిగా నడుపుతున్నాడు. 'ఎందుకింత ప్రత్యేకంగా పిలిచింది కాంచన? ఏమీ అఘాయిత్యం చేయబోవడం లేదుకదా?'

అతడు కారునడుపుతూన్న వేగంచూచి దారినివెళ్ళే ఇతర వాహనాలు వాటంతటవే దూరంగా తొలగి, దారి ఇస్తున్నాయి.

"అత్తయ్యా, కాంచన ఎందుకు నన్ను పిలిచింది. అర్జంటుగా రమ్మని ఉత్తరంరాసింది"/ అతి ఖంగారుగా వచ్చి అడుగుతూన్న మాధవ్‌ను నారాయణమూర్తి, భార్యా వింతగా చూశారు.

"ఎందుకు కబురంపి వుంటుంది?" ముఖముఖాలు చూచుకొన్నారు.

కాంచన ఆమె గదిలో లేదు. ఖంగారుగా యిల్లంతా వెదికారు. ఎక్కడా లేదు.

"ఇంకెక్కడుంటుంది? అక్కడే శ్మశానంలోకూర్చొని వుంటుంది. నడవండి" ఏడుస్తూ పరుగెడబోతూన్న మామనూ, అత్తనూ బలవంతంగా కారులో కూర్చుండజేసి బయల్దేరాడు మాధవ్. అతడి కారు ఆగుతూండగానే. అతివేగంగా వచ్చి మరో కారు ఆగింది. రత్నా, తండ్రి, అనసూయమ్మ వగయిరా బలగమంతా వున్నారందులో.

ఒక సమాధి దగ్గర ఆ వానకు తడుస్తూ పడివున్నది కాంచన.

"అదుగో" అందరూ అటుపరుగెత్తారు.

తన చేతులమీద ఎత్తి తడిముద్దలావున్న కాంచనను దగ్గరలోనేవున్న శివాలయంలోనికి తీసుకు వెళ్ళాడు మాధవ్. కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తోంది కాంచన తల్లి కామాక్షి.

"నిన్న కోర్టు తీర్పు యిచ్చినట్టు తెలిసింది—విడాకులు మంజూరు చేసినట్టూ, మన దగ్గర అతడు తీసుకున్న డబ్బంతా వాయిదాల పద్ధతిని తీర్చేట్టూ. అది తెలిసిన దగ్గరనుండి యేమిటోగా వుంది. ఏమీ త్రాగలేదు కాంచన. నా తల్లీ" అంతకంతకు ఆమె రోదన ఎక్కువౌతోంది.

"ఏడవకమ్మా!" నీరసంగా అంది కళ్ళు తెరచి.

మాధవ్‌ను చేయి పట్టుకొని "నీకు శ్రమ కలిగించాను బావా క్షమించు. ఇంకెప్పుడూ ఇలా చేయనుగా? రత్నా ఇటురా."

రత్న జంకుతూ దూరంగా నిలబడిందేకాని దగ్గరకు వెళ్ళలేదు.

జనార్దనరావు రత్నను ఆమె దగ్గరకు తీసుకువెళ్ళాడు.

"ఏమిటిదంతా మాధవ్? నాకేమీ అర్థం కావటం లేదు." అన్నాడు జనార్దనరావు.

"నేను చెపుతాను." కాంచన నీరసంగా అన్నది"నా వల్ల మీ యిద్దరిమధ్యా మనస్పర్థలు వచ్చినటు నాకు తెల్సు. రత్నా! కాని ఏం చేయను? ఇది ఎవరూ చేచేతులా చేసుకున్నవి కాదు. కేవలం దైవనిర్ణయాలే. నీవునన్నూ బావనూ నీచంగా అనుమానించావు. అందుకే నేనిచ్చిన బహుమానాలు నాకు త్రిప్పిపంపావు. అనసూయమ్మ నాకు అంతాచెప్పింది ......" ఆయాసంతో ఆగింది.

"అనసూయా? నీ కుళ్ళుబుద్ధి ఇక్కడకూడా ప్రదర్శించావా? నీవున్నచోట పచ్చగడ్డి భగ్గుమంటుందే. బుద్ధి తక్కువై నిన్నిక్కడ వదిలాను నేను" జనార్దనరావు నెత్తీ, నోరూ కొట్టుకొన్నాడు.

కాంచన అన్నది. "చూడు రత్నా! ఈ ఆఖరి క్షణాలలో ఈ దేవాలయంలో అబద్ధమాడను. బావ నిప్పువంటి మనిషి! నీ వెంతో అదృష్టవంతురాలవు గనుక అతడిని పొందగలిగావు.అయితే మేం ఒకప్పుడు ప్రేమికులమన్న మాట నిజం. కానీ, భూమీ ఆకాశం కలియనట్టే ఈ లోకంలో ప్రేమా పెళ్ళీ కలియవు."

"వద్దు కాంచనా మాట్లాడకు." ఆవేశంగా అరిచాడు మాధవ్. "నడవండి హాస్పిటల్‌కు తీసుకుపోదాం, ఏం మింగావో చెప్పు కాంచనా. నా బంగారుతల్లివి కదూ?"

మాధవ్ కనులు వర్షించసాగాయి.

"వద్దుబావా. నేను ఎండ్రిన్ త్రాగేశాను. నన్నెవల్లా బ్రతికించలేరు, నా మాట వినండి. అట్టే వ్యవధిలేదు."

ఒక్కసారిగా అందరూ ఘొల్లుమన్నారు.

"ఎంతపని చేశావు కాంచనా? ఆఖరికి బలవన్మరణం శరణ్యమనుకొన్నావా?" ఆమెను పొదివి పట్టుకొని కన్నీరు కురిపించసాగాడు మాధవ్. "నాపై ప్రేమ నిన్ను ఆఖరికి సర్వనాశనం చేసిందా?"

"లేదు లేదు, నాకోసం నీవు కన్నీరు కురిపించుతున్నావు. నీ చేతులలోనే నేను ఆఖరిశ్వాసను పీల్చుకుంటున్నాను. చాలు ఈ తృప్తి బావా, రత్నను ఎప్పుడూ బాధపెట్టకు. మీ ఇరువురి ఆనందం ఆ లోకంనుండి చూస్తూంటాను...అమ్మా. నాకోసం ఏడవద్దు. నేను నా బాబు దగ్గర కెళ్ళిపోతున్నాను. అదుగో...బాబును ఖననం చేసినచోటే నన్నూ మట్టిచేయండి. బాబును శాశ్వతంగా వళ్ళోపెట్టుకొని దీర్ఘనిద్రపోతాను. బావా! ఒక్కసారి నన్ను అలా బాబు దగ్గరకు తీసుకెళ్ళి పడుకోబెట్టవూ?"

"నన్ను...నన్ను క్షమించక్కా." రత్న బావురుమన్నది.

"ఫర్వాలేదు. బావమీద ఎటువంటి దుశ్శంకా పెట్టుకోకు. మీ అందరికీ కలతలు సృష్టించుతూ బ్రతికిఉండటంలో అర్థంలేదు, అందుకే పోతున్నాను. మీ అందరి

అశ్రువుల అభిషేకంతో నయినా మరుజన్మలో సుఖపడ గలుగుతాను.''

"బావా ? ఇప్పుడు నేను మీవల్ల ఆత్మహత్య చేసు కుంటున్నానని అనుకోవద్దు. భర్త నిరసించి త్యజించిననాడే నాలో ఈ విరక్తి కలిగింది. బిడ్డ మరణంతో అది నాలో పెరిగింది. పృథ్విపై బ్రతికి లాభంలేని జీవితం, భారంగా మోయకపోతే నేం—అనుకున్నాడు. కానీమర్మార్గు డైన గోపాల్ నా డబ్బుతిని కులకటం ఇష్టంలేదు నాకు. అందుకే ఈ కేసు తీర్పు వినేవరకూ ఓపికగా వేచివున్నాను. నా వలన అతనికి సంక్రమించిన 80 వేలు వాయిదాల పద్ధ తిని తీర్చుకోమని కోర్టువారి ఆదేశం. ఆ డబ్బు నీకే చెందాలి బావా. అలా విల్లు వ్రాసాను."

"వద్దు కాంచనా. నేను పరాయిసొమ్ము ముట్టేవాడిని కానని నీకూ తెల్సు!''

"తెల్సు. కాని అది నా అభిమతం. మీవంటి నిస్వా ర్థుల దగ్గర డబ్బు సద్వినియోగమౌతుంది. నీ ఫ్యాక్టరీలో శ్రమజీవులకు నీ ఇష్టప్రకారం అది దానంచేయి. సౌకర్యా కల్పించు. ఈ ప్రపంచంనుండి నేను పోయినా, ఆ పుణ్యాత్ము లందరి గుండెలలో ఆ విధంగా నేను నిలచి వుంటాను .... రత్నా సెలవ్......బావా సెలవ్ !''

— ||| —